మాని సజీవవర్తమానము నుపాసించుటకై మేము ని
న్నాహ్వానించుచున్నాము; గతార్థములనుగూర్చి యూరక
చింతించుటను మాని ప్రస్తుతకార్యాచరణమునకై మేము
ని న్నాహ్వానించుచున్నాము; ప్రాంత పుంతలను శిథిలమార్గ
ములను దిరిగి గనుఁగొనుటలో నీ శక్తిసామర్థ్యములను
వ్యర్థ మొనర్చుకొనుట మాని యతిసమీపమునఁ గల నూతన
విశాలరాజమార్గములను బట్టుటకై మేము ని న్నామతించు
చున్నాము. ధీమంతు లిది గ్రహింతురుగాక!

యథార్థమగు శ్రద్ధాశయమును మఱల మనము
లక్షింపవలయును, ఆత్మవిశ్వాసము మఱల మనలో రగు
ల్కొల్పఁబడవలయును, మన దేశము నెదుర్కొనుచున్న
సమస్య లపుడే స్వయముగా మనచేతనే క్రమముగాఁ బరి
ష్కరింపఁబడఁగలవు.

కొంచెము మర్యాదగా మాటలాడుచుండుటవలన
సామాన్యమానవునికంటె నీ వధికుఁడ వనుకొనుచున్నావు
కాఁబోలును. అన్నిటికంటెను 'నేను పారమార్థికుఁడ'నను
నహంభావము నీలోఁ బ్రవేశించినయెడల దౌర్భాగ్యము నీకు
దాపరించినదన్నమాటయే. అది మహాఘోరమగు బంధము.

కఠోపనిషత్తునందుఁగల శ్రద్ధయను దివ్యపదము నాకు
జ్ఞప్తిలో నున్నది. శ్రద్ధాతత్త్వమును, లేక యథార్థవిశ్వాస
మునుగూర్చి ప్రచార మొనర్చుటయే నా జీవితోద్యమము.
మానవకోటియందును సకల మతధర్మములందును ప్రబల
శక్తిసముపేతమైనవానిలో శ్రద్ధ ముఖ్యమని పలుమాఱులు

నేను నొక్కి వక్కాణింతును. మొట్టమొదట నాత్మవిశ్వాసము గలిగియుండుడు. ధనికులను గొప్పవారిని లక్షింపకుడు. ప్రపంచమందలి మహాకార్యములను బ్రహ్మాండమైన యుద్యమములను నన్నిటిని నిర్వహించినవారు నిర్ధనులే. సుస్థిరులైయుండుడు, అన్నిటికంటెను నిష్కపటులై, వినిర్మలులై, కార్యదీక్షాదక్షులై యుండుడు. మహాకార్యముల కుద్దేశింపఁబడినవారమను విశ్వాసము గలిగియుండుడు.

ఆత్మవిశ్వాసమును గోల్పోయి యచలమై, నిద్రాణమైయున్న భారతదేశమును మేల్కొల్పుటయే యిపుడు నా యేకైక వాంఛ. ఈ దేశమును మేల్కొల్పి సనాతనధర్మోన్నతిని గుర్తింపఁజేయఁగలిగితినేని శ్రీరామకృష్ణుని యొగమనమును మా జననమును వ్యర్థము కాలేదని తలఁతును. ఇదియే నా తాపత్రయము. ముక్తి మొదలగున వన్నియు నా కెంతమాత్రము గణనీయములు కావు...మన పురాతన గ్రంథములు ప్రమాణభూతములని యేకరువు పెట్టుచుండుట వలన నేమియు లాభము లేదు. పాశ్చాత్యనాగరికతాతరంగము పొంగి దేశముమీఁదికి వచ్చి పడుచున్నది. అణుమాత్రమైనను ప్రయోజనమును గమనింపక పర్వతాగ్రములపై ధ్యానస్థితులమై కూర్చుండుటవలన లాభము లేదు. గీతలో భగవానుఁడు దెల్పినచందమున నప్రతిహతశక్తితో, అఖండ ధైర్య సాహసములతోఁ దీవ్రకర్మయోగము నవలంబించుటయే యిపుడు మన కర్తవ్యము. అపుడే దేశీయులు నిద్ర మేల్కొందురు.

మన జాతీయరక్తమునఁ బ్రవేశించుచున్న యీ ఘోరవ్యాధిని—ప్రతివిషయమును జూచి హేళనచేయుటను—అశ్రద్ధను—విడిచిపెట్టుఁడు. దానిని దరిఁజేరనీయకుఁడు. ధీరులై శ్రద్ధ నవలంబింపుఁడు, మిగిలినవన్నియు స్వయముగనే దాని ననుసరించును.

'మేము నిర్ధనుల' మనియు 'మాకు మిత్రులు లే'రనియుఁ గుందకుఁడు. ధనము మనకు మానవత్వమును సంపాదింపఁజాలునా? మానవుఁడే యెప్పుడును ధనమును సంపాదించువాఁడు. మానవశక్తిచే, ఉత్సాహశక్తిచే, శ్రద్ధాశక్తిచే—వీనిచేతనే ప్రపంచమంతయు నిర్మింపఁబడియున్నది.

మతాభిమానపూరితుని తీవ్రతతో — గాంభీర్యముతో—నైహికవాది బాహ్యదృక్పథ వైశాల్యము మేళవింపఁబడవలయును—ఇదియే నేను గోరునది. సాగరమంతటి గంభీరము, అనంతాకాశమంతటి విశాలము—నిట్టి హృదయమే మనకు వలయునది.

నీ యాదర్శము నెడఁ దీవ్రశ్రద్ధాభక్తులు—సుస్థిరనిష్ఠ—తాత్కాలికమైనదికాక, యుగములనడుమను మెఱుములనడుమను నాకసమువంకనే చూచుచు, మేఘమండలమునుండి పడు బిందువులనే కాని మఱియొక నీటిని ద్రావని చాతకపక్షినిష్ఠను బోలిన నిష్ఠ—నీకుండవలయును.

పవిత్రుఁడవగు ప్రయత్నమున శరీరమును త్యజింపుము; సహస్రపర్యాయములైనను మృత్యువు నాహ్వానింపుము. నిరుత్సాహము జెందకుము. చక్కని యమృతము

లభింపనియెడ, విషము ద్రాగవలయుననుట కది హేతువు కాఁజాలదు.

మతమునుగూర్చి యెన్నఁడును వాదులాడకుము. మతసంబంధమగు వాదోపవాదములన్నియుఁ బారమార్థిక శీలము లేదనియే తెలుపును. మతవివాదము లెప్పుడును గుంజును విడిచి తొక్కకే సంబంధించునట్టివి. పవిత్రతయుఁ బారమార్థికతయుఁ బలాయనమైపోవ, హృదయము శుష్కమైయుండునపుడే వివాదము లారంభమగును, అంతకు ముందుఁ గాదు.

వాదములను లక్షింపకుము, సిద్ధాంతములనుగాని, సంప్రదాయములను గాని, యాలయములను గాని, దేనిని లక్షింపకుము; ప్రతిమానవునందును గల బ్రహ్మతత్త్వము నందలి సారమగు పారమార్థికతతోఁ బోల్చిచూచినచో నివి యెందులకును గొఱగావు; పారమార్థికశీల మెంతవికాసము చెందునో మానవుఁ డంతటి మహిమాన్వితుఁడై యొప్పును. మొదట దానిని సంపాదింపుము, ఎవ్వనిని గూర్చియు విమర్శింపకుము, ఖండింపకుము, ఏలన, సర్వ సిద్ధాంతములందును సర్వమత సంప్రదాయములందును నేదియో కొంత మేలుండును. మతమునది—ధర్మమును నది—శబ్దములతోఁగాని, నామములతోఁగాని, సంప్రదాయములతోఁగాని కూడుకొనియుండునది కాదనియు సాక్షాత్కారమే మతమనియు—ధర్మమనియు—నీ జీవితముచే లోకమునకుఁ బ్రకటింపుము.

మనఃపూర్వకమగు విశ్వాసము, వినిర్మలాశయము— ఇవియే విజయోపేతమై యొప్పునవి, వీనిచే శోభించునట్టి వారు కొలఁదిమందియైనను సమస్తనిరోధములను నెదిర్చి నిలువఁ గలుగుదురు.

సత్యవ్రతము, నైర్మల్యము, స్వార్థరాహిత్యము నను వానిచే నొప్పువాని నణంచుశక్తి ముల్లోకములందును లేదు. అట్టివాఁడు విశ్వమునంతను నెదిర్చి నిలువఁ గలఁడు.

దౌర్బల్యమునకు గుఱియగు సమయములలో నిట్లు పర్యాలోచించుకొనుము: "నే నాతని (శ్రీరామకృష్ణుని) పుత్రుడనుగానా? ఆమహనీయు ననుసరించు నే నిట్టినీచ కార్యములు చేయవచ్చునా?" దైన్యమును దుర్బలమనో భావములను బోనడచి, ధీరుఁడవై నిలిచి, "నేననంతశక్తి ప్రపూర్ణుఁడను, విశుద్ధధీనిధిని. అఖండజ్ఞానస్వరూపుఁడను. సచ్చిదానందమయపరబ్రహ్మమను నేను!" అని భావింపుము. "నే నామహనీయునిశిష్యుఁడను. కామకాంచన విజేతయగు శ్రీరామకృష్ణుని దాసానుదాసుఁడ" నను భావముననే నీ యహంభావ మిమిడియుండవలయును. ఇట్టి యాత్మగౌరవము లేనివానిలో నెన్నఁడును బ్రహ్మశక్తి ప్రజ్వలింపదు. "జగజ్జననీ పరిపాలనమున, నీ జగంబున నే భయపడున దెవరికి?"యను (నర్థమిచ్చునట్టి) రామప్రసాదునికీర్తనమును వినలేదా? ధీరుఁడవై మహావీరనామమును స్మరించుచు, 'మహామాయ'ను శరణుపొందుము. సమస్త ప్రపంచమును బ్రహ్మస్వరూపముగాఁజూడుము—దైన్యము,

దౌర్బల్యము, పిఱికితనము నంత నిన్ను సమీపింపఁజాలవు.

నీయందును నీ దేశీయులందును శ్రద్ధాభక్తులను బెంపొం కొల్పుము. తత్త్వాన్వేషణమునకై యావశ్యకమగుచో, నచికేతునివలె యమాలయమునకైనను బోవుటకు వెనుదీయకుము! భయమే మరణము, కావున నిర్భయుఁడవు కమ్ము. భయరహితుఁడవై నేఁటినుండి యాత్మమోక్షజగత్కల్యాణములకై నీ జీవితము నాహుతి యొనర్పసంసిద్ధుఁడవు కమ్ము. కానిచో, నీ రక్తమాంసమయకళేబరమును మోయుటవలని ఫలమేమి?

## ఐదవ ప్రకరణము

# త్యా గ ము

మహాత్యాగమువలననే మహాకార్యములు సిద్ధించును.

సమదర్శనమున కవసరమగుచో, సమస్తము త్యజింపవలయును.

ఒరులకు ముక్తిని జేకూర్చుటకై యమాలయమునకైనను బొమ్ము. 'నా ముక్తి' యని ప్రాఁకులాడుట కిలలోఁ దావు లేదు.

ఒరులకై సమస్తము త్యజించువానికే ముక్తి. ఇంక నహర్నిశము 'నాముక్తియో, నాముక్తియో' యని దేవులాడువారు యథార్థమగు తమ యిహపరశ్రేయమును నశింపఁ జేసికొని పరిభ్రమించుచుందురు. ఇది నాకెన్నియో సార్లు ప్రత్యక్షగోచరమైన విషయము.

స్వీయ మోక్షప్రాప్తిచే నేమి ప్రయోజనము? మధురాహారమును విశేష మనుభవించువాఁ డెవఁడు? అంతయుఁ దానే తినువాఁడా, అన్యులతోఁగూడి భుజించువాఁడా? సమస్త ప్రపంచమును మనతోఁగూడ మోక్షసౌధమునకుఁ గొనిపోవలయును. ఈ మాయాప్రపంచమున మన మాధ్యాత్మికదావాగ్నిని బ్రజ్వలింపఁజేయవలయును. అపుడే సచ్చిదానందసామ్రాజ్యమున సుప్రతిష్ఠితులమై వెలయఁగలము. ఓహో! శాశ్వతాత్మానందమున కెనయగు నానందమెద్ది? 'సర్వభూతస్థ మాత్మానం సర్వభూతాని చాత్మని'—తన్ను సర్వభూతములందును సర్వభూతముల యందును దన్ను గాంచునట్టి యా యనిర్వాచ్యస్థితిలో వివశులై మీరు బ్రహ్మానందసాగరమున నోలలాడెదరు. సమస్త జీవులందును నిరుపమానప్రేమ సానుభూతులను జూపుట మీకపుడు నైసర్గికమగును. ఇదియే యనుష్ఠాన వేదాంతము.

నా దేశమున నొక కుక్కయైనను బస్తుండియున్నంతవఱకు దాని కాహారము నిడి రక్షించుటయే నా పరమధర్మము, ఇదియే నామతము; తద్భిన్నమంతయు నధర్మము, కృత్రిమధర్మము.

'ఒక్కప్రాణికి సాయము చేయఁగల్గినచో, సహస్ర పర్యాయములు కుక్కనై పుట్టుటకైన సంసిద్ధుఁడ'నని గురుదేవుఁడు (శ్రీరామకృష్ణుఁడు) వచింపలేదా?... మీలోఁ బ్రతివ్యక్తియు నాధ్యాత్మికసింహమని గుర్తింపుఁడు. మత

ధర్మముల నుద్ధరించుటే మన ధర్మమని గ్రహింపుఁడు. ప్రతిజీవియు సాక్షాద్భగవత్స్వరూపమని గ్రహించి, దరిద్ర నారాయణుల, నార్తనారాయణుల నర్చించు విధానము లోకమునకు మనము చూపవలసియున్నది. భారతదేశమున నూతన సన్న్యాససంప్రదాయమును స్థాపించుటయే నా జీవితోద్దేశము. జనసామాన్యము నుద్ధరించుటకై జీవితములను ధారపోయుటే యీ సన్న్యాసుల యాదర్శము.

మీలోఁ బ్రతివ్యక్తియు లోకశ్రేయమునకై జీవితము నర్పింపవలయును. మనము ధారపోయు రక్తధారలనుండి ప్రపంచమును మార్చివేయునట్టి వీరాధివీరులును భాగవతయోధులును వెలువడియెదరని నమ్ముఁడు!

నీ మోక్షమునకై నీవు ప్రాఁకులాడినచో నరకమే గతి నీకు! ఆత్మసామ్రాజ్యము నందఁగోరెదవేని 'నా ముక్తియో' యను నుబలాటమును నిర్మూలించుకొనుము. అదియే మహోత్తమసాధన.

మహాపురుషులు మహాత్యాగము చేయుచుండుటయు జనసామాన్యము వాని సత్ఫలముల ననుభవించుచుండుటయు లోకవిదితము. నీ మోక్షమునకుఁగాను నీవు సమస్తము త్యజించు టొక ఘనకార్యము కాదు. లోకకల్యాణార్థము మోక్షమును సైతము పరిత్యజింపనెంతువా? ఎంచెదవేని సాక్షాత్ భగవానుఁడవు—ఈ విషయము నాలోచింపుము.

ఏమియుఁ గోరకుము; ఏ ప్రతిఫలమును నాశింపకుము.

నీవీయవలసినదాని నిచ్చివేయుము; అది తిరిగి నీయొద్దకే వచ్చును—కాని యిపుడు దానినిగూర్చి తలపోయకుము. అది వృద్ధియై—సహస్రగుణాధికమై—తిరిగి వచ్చును—కాని నీవు దానిని లక్షింపరాదు. ఇచ్చుటకు నీకు శక్తి కలదు. ఇచ్చివేయుము, అంతే.

త్యాగమును మించిన సుగుణములేదు. గ్రహించుచు నెవ్వఁడు తన చేతిని ముడుచుకొనునో వాఁడే యత్యల్పుఁడు; ఇచ్చుచు నెవ్వఁడు తనచేతిని జాచునో వాఁడే యత్యధికుఁడు. సర్వదా యిచ్చుటకే చేయి సృజింపఁబడినది. ఉపస్థితుండియున్నను నీ యొద్దనున్న పిడికెఁడన్నమును బెట్టివేయుము. ఇతరులకుఁ బెట్టుటవలన నీవు నిరాహారివై మృతినొందవలసివచ్చుచో, నాక్షణముననే ముక్తుఁడవగుదువు. తత్క్షణమే నీవు పరిపూర్ణుఁడవగుదువు, భగవంతుఁడవగుదువు.

పేరుప్రతిష్ఠ లెవరికిఁ గానలయును? వాని నవ్వల విసరివేయుము! నిరాహారుల నోటఁ బిడికెఁడన్నమును బెట్టు ప్రయత్నమునఁ బేరును సిరిసంపదలును నన్నియు రూపుమాసిపోయినను—ముమ్మాటికిని నీవు ధన్యుఁడవు. ఔదార్యము, ఔదార్యమే జయించునది—ధీశక్తికాదు. ప్రేమతోఁబోల్చి చూచినచోఁ, బుస్తకములును బాండిత్యమును, యోగమును ధ్యానమును నన్నియుఁ గేవల తృణప్రాయములు.

భారతమాత యధమమొక వేయిమంది యువకుల త్యాగమును గోరుచున్నది,—వలయునది పౌరుషము గల

యువకుల త్యాగము, పశుప్రాయుల త్యాగము కాదు... మీ తండ్రితాతల నిరంకుశాధికారముచేఁ బశుతుల్యముగాఁ జేయఁబడిన మీ దరిద్రసోదరకోటి నుద్ధరించుటకై — నూతన పరిస్థితులను గొనివచ్చుటకై — పేదలయెడ సానుభూతిని — క్షుధార్తులగు వారల కడుపుమంట చల్లార్పఁ బట్టెఁ డన్నమును — జన సామాన్యమునకు విద్యను — జేకూర్చుటకై ప్రాణముల నర్పించు త్యాగులను జెన్నపురి మీ రెందఱను సమకూర్పఁ గలదు?

వలయునది శాంతము, నిరాడంబరము, అచంచలమునైన కృషి — అంతియే కాని వార్తాపత్రికావంచన కాదు, పేరుప్రతిష్ఠలకై యుబలాటము కాదు, — ఈ సంగతి సదా మది నుంచుకొనుఁడు.

పేరుప్రతిష్ఠల నిమిత్తము కాక, లోకమున కత్యావశ్యకము సందేశముల నొసఁగు నిమిత్తము మహాత్ములావిర్భవింతురు, కాని వారి యనుచరులు వారిబోధలను గంగలోఁ గలిపి, వారినామములను నిలువఁబెట్టుటకై ప్రాఁకులాడుచుందురు, అందులకై కలహించుచుందురు — ఇదియే లౌకికుల ధోరణి.

మతసంప్రదాయము లేనాఁడు ధనికులకు వంగివంగి సలాములు చేయ నారంభించునో యానాఁడే వాని యధఃపతన మారంభ మైనదని గ్రహింపుఁడు.

త్యాగాగ్నికీలలలో దుమికి జనులకుఁ బారమార్థిక చింత గల్గింపుఁడు. శ్రద్ధ యున్నచో సమస్తము లభించును.

వలయునది త్యాగము—అది లేనిదే పరహితార్థమై యెవ్వరును మనఃపూర్వకముగాఁ బాటుపడఁజాలరు. త్యాగి యెల్లరను సమదృష్టితోఁ జూచును—అట్టిచో నితరులకంటె విశేషముగ భార్యయు బిడ్డలును నీ వారని యేల ప్రాఁకు లాడెదవు? నీ ద్వారముకడ సాక్షాన్నారాయణుఁడు పేద భిక్షుకరూపమున నిరాహారియై చనిపోవుచున్నాఁడు! వానికే మైన నిచ్చుటకు బదులు రుచ్యాహారములతోఁ—బిండి వంటలతో—నీ భార్యను బిడ్డలను మాత్రమే తృప్తిపఱుప నెంతువా? ఏల, అది రాక్షసకృత్యము!

స్వార్థరహితమైన దేదియో యదియే నీతి, ధర్మము; స్వార్థపరమైన దేదియో యదియే యవినీతి, అధర్మము.

లోకము మనకేమియు ఋణపడియుండలేదనియు మనమే లోకమునకు ఋణపడియున్నామనియు గుర్తింప వలసియున్నది. లోకమున కేమైనను హితమొనర్చుట కంగీ కరింపఁబడుట మనమహాభాగ్యము, గర్వింపఁదగిన సదవ కాశము. పరోపకారమున నిజముగా మనకే మన ముపకార మొనర్చుకొనుచున్నాము.

నాలుగు దమ్మిడీలను జేతఁ బట్టుకొని, "ఇదిగో నోయి, యాచకుఁడా!" యని స్వాతిశయముతో, అహం భావముతో వర్తింపక, వానికి దానము చేయుటచే నాత్మ హిత మొనర్చుకొనుటకై నీకొఱకా బీదవాఁడచట నున్నాఁ డని వానియెడల గృతజ్ఞుఁడవై యుండుము. ధన్యుఁడగువాఁడు దాతకాని ప్రతిగ్రహీతకాఁడు.

స్వార్థరాహిత్యమే విశేషలాభకరము, కేవలము జనులకు దాని నవలంబించునంతటి యోరిమి లేకున్నది.

మహనీయుఁడవై యుండుము. త్యాగములేనిదే యే మహాకార్యమును సిద్ధింపఁజాలము. విశ్వమును సృజించుటకై పురుషుఁడు తన్ను దాను ద్యాగమొనర్చుకొనెను. మీ సుఖములను మీ భోగములను మీ పేరుప్రతిష్ఠలను, వేయేల, మీ జీవితసర్వస్వమును సమర్పించి తన్మూలమునఁ గోట్లకొలఁది మానవు లీ సంసార సాగరమును దరించునట్టి సేతువును నిర్మింపుము. శ్రేయస్కరశక్తుల నన్నిటిని గేంద్రీకరింపుము. మీ రేమతపతాకను దాల్చి పురోగమించుచున్నను సరియే: పచ్చన గానిండు, నీలిమగానిండు, యెఱుపు గానిండు,—మీ జేరంగైనను సరియే,—యన్నిటిని గలిపి వైచి స్వచ్ఛధవళవర్ణమును—ప్రేమవర్ణమును—వెలువరింపుఁడు. కృషిచేయుటయే మనవంతు. ఫలములు వాని యంతట నవియే కలుగును. ఆ చింత మనకేల ?

లోకమున సదా దాతవై వర్తింపుము. అన్నిటి నిచ్చివేయుము, ప్రతిఫలము నాశింపకుము. ప్రేమను, సాయమును, సేవను, నీచేతనైన యే యల్పవస్తువునైనను నొసఁగుము, కాని కోమటి బేరపు దృష్టితోమాత్రము వలదు. ఏ 'షరతులను' విధింపకుము, అపు డెవ్వరును వంచితులుగారు. భగవానుఁడు మన కొసఁగునటులనే యౌదార్యముతో నిచ్చివేయుదముగాక !

## ఆఱవ ప్రకరణము

## సేవ

ప్రతిపురుషుని, స్త్రీని, ప్రతివ్యక్తిని సాక్షాద్భగవత్స్వరూపముగాఁ గనుము. నీవెవ్వరికి నుపకారము చేయఁజాలవు, తోడ్పడఁజాలవు, కేవలము సేవింపఁగలవు—అంతియే. నీకధికార మున్నచోఁ బరమేశ్వరసంతానమును సేవింపుము, పరమేశ్వరునే సేవింపుము. తనబిడ్డలలో నెవ్వనికైనను దోడ్పడఁ బరమేశ్వరుఁడు నిన్ననుగ్రహించినచో, నీవు ధన్యుఁడవు, 'నే నింతవాఁడ నంతవాఁడ' నని యాత్మసంభావన చేసికొనకుము. ఇతరులకు లభింపని విశేషావకాశము—అధికారము—నీకు లభించుటచే నీవు ధన్యుఁడవు. దానిని సేవగా—ఆరాధనగా—నొనర్పుము. రోగిరూపమున, నున్మత్తునిరూపమునఁ, గుష్ఠవ్యాధిపీడితునిరూపమునఁ, బాపిరూపమున వచ్చిన పరమేశ్వరుని మనము సేవింపఁగలుగుటకై—పాపులును దుఃఖితులును మనమోక్షమునకై—జన్మించి యున్నారు.

మానవశరీరమున మానవాత్మయే మన కర్చనీయుఁడగు భగవంతుఁడు. జంతువులును భగవంతున కాలయములనుట నిజమే, కాని మానవుఁడే మహోత్తముఁడు; ఆలయములలో మానవశరీరాలయము తాజమహాలు. అందు నే నారాధింపఁజాలనిచో, మఱియే యితరాలయమువలనను నాకు లాభము కలుగదు.

భావి సంస్కర్తలారా! భావి దేశాభిమానులారా!

పరితపింపుఁడు! మీకుఁ బరితాపము కలదా? దేవతాసంత తియు ఋషిసంతతియునగు కోట్లకొలఁది జనులు పశుప్రాయు లైయున్నారని మీరు పరితపించుచున్నారా? కోట్లకొలఁది మంది నేఁడు తినఁ దిండిలేక మాడుచున్నారని, కోట్లకొలఁది జను లనేకయుగములనుండియుఁ బస్తుండవలసివచ్చుచున్న దని మీరు పరితపించుచున్నారా? అజ్ఞానము కారుమబ్బు వలె దేశమునంతటను నావరించుకొనియున్న దని మీరు పరిత పించుచున్నారా? అది మీకేమియుఁ దోఁపనీయకున్న దా? నిద్రపట్టనీయకున్నదా? అది మీరక్తమునందుఁ జొచ్చి, మీ రక్తనాళములందుఁ బ్రవహించుచు, హృదయస్పందనముల తోఁబాటు కొట్టుకొనుచున్న దా? అది మి మ్మించుమించు పిచ్చివాండ్రను జేసివైచినదా? ఇట్టివినాశము గలిగి నదేయను తదేకచింత మి మ్మావహించినదా? మీ పేరు ప్రతిష్ఠలనుగూర్చి, మీభార్యాపుత్రులనుగూర్చి, మీసిరిసంప దలనుగూర్చి, తుదకు మీశరీరమునుగూర్చి పూర్తిగా మీరు మఱచితిరా? ఈపని మీరు చేసితిరా? దేశాభిమాని యగుట కిది మొదటిమెట్టు, మొట్టమొదటి మెట్టు.

మీకుఁ బరితాపము కలిగినదనుకొందము; వ్యర్థ ప్రసంగములతో మీశక్తిసామర్థ్యములను దుర్వినియో గముచేసికొనుటకుబదులు, దీనికేమైనఁ బరిహారోపాయమును, పనిచేయఁ గలిగిన పరిష్కారమును, ఖండనముసకుబదులు తోడుపడఁగలిగిన త్రోవను, జనులకు దుఃఖోపశమనమును గలిగించు చల్లనిమాటలను, ఈ జీవన్మృతస్థితినుండి వెలువ

రించు మార్గమును—దేనినైనను గనుఁగొంటిరా? కాని యదియుఁ జాలదు. కొండంతటి యాటంకములు వచ్చినను వానిని దాఁటఁజాలు వజ్రసంకల్పము మీ కున్నదా? ఖడ్గము చేపట్టి ప్రపంచమంతయు మీ కెదురై నిల్చినను, మీరు న్యాయ్యమని తలఁచినదాని నాచరించు సాహసము మీ కున్నదా? మీ యాలుబిడ్డలు మీకు వ్యతిరిక్తులై యున్నను, మీ సిరిసంపదలు నశించినను, మీ పేరుప్రతిష్ఠలు మాసి పోయినను, ధర్మమార్గమును విడువకుందురా? దానినే యనుసరించుచు, మీగమ్యమును జేరువఱకును సుస్థిరులై నిలుతురా? భర్తృహరిమహారాజు వచించినట్లు—"నీతి వేత్తలు నిందింతురుగాక, మెచ్చుకొందురుగాక; భాగ్య దేవత వచ్చుఁగాక, తన యిచ్చవచ్చినచోటికిఁ బోవుఁగాక; మరణ మిప్పుడే కలుగుఁగాక, కల్పాంతరమునకుఁ గలుగుఁ గాక; ధీరులగువారు న్యాయ్యమార్గమును దాఁటి యొక్క యడుగైనను బెట్టరు."* మీకట్టి స్థైర్యము కలదా? ఇవి మూఁడును మీయొద్దనున్నయెడల, మీలోఁ బ్రతివ్యక్తియుఁ మహాద్భుతకార్యములను జేయఁజాలును. వార్తాపత్రికలలో మీరు వ్రాయనక్కఱలేదు, ఉపన్యాసము లిచ్చుచు నూ

---

* శ్లో. నిన్దన్తు నీతినిపుణా యది వా స్తువన్తు
లక్ష్మీః సమావిశతు గచ్ఛతు వా యథేష్టమ్,
అద్యైవ వా మరణమస్తు యుగాన్తరే వా
న్యాయ్యాత్పథః ప్రవిచలన్తి పదం న ధీరాః.
—భర్తృహరిసుభాషితము—నీతిశతకము—ధైర్యపద్ధతి, 4.

మూరఁ దిరుగనక్కఱలేదు, మీముఖమే దేదీప్యమానమై ప్రకాశించును. గుహాంతరమున మీరు నివసించుచున్నను, మీ సంకల్పములు ఱాతిగోడలనుండి వెలువడి, యేవ్యక్తి తలయందో ప్రవేశించి యచటఁ గార్యరూపము నొందువఱకును బ్రపంచమంతటను స్పందించుచునే యుండును. సంకల్ప ప్రభావము, నైర్మల్య మహత్త్వము, భావసంశుద్ధి—యిట్టిది.

సోదరులారా! దారిద్ర్యముచే, మతాచార్యకైతవముచే, రాక్షసశాసనములచే నధఃకృతమైయున్న భారత దీన జనసహస్రముల యభ్యుదయార్థము మనమందఱు మహర్నిశము ప్రార్థింతము గాక! అగ్రజాతులకును ధనికులకునుగంటె నీ దీనులకు మతధర్మములను బోధించుటయే నాయభిమతము. నేను దార్శనికుఁడనుగాను, వేదాంతినిగాను, ఋషి నంతకంటెఁగాను; నేను బేదను, పేదలయందు నాకుఁ బ్రీతి. ఈ దేశమున (అమెరికాలోఁ) బేదల నెట్లాదరపూర్వకముగాఁ బిలుతురో, వారియెడ నెందఱెందరు సానుభూతి వహింతురో, ప్రత్యక్షముగాఁ జూచుచున్నాను. కాని హిందూదేశమునకును ఈదేశమునకును నెంతటి వ్యత్యాసము! దారిద్ర్యమున, అజ్ఞత్వమున మునిఁగి తేలుచున్న యిరువదికోట్ల స్త్రీపురుషుల క్షేమమును గోరి పరితపించువారెవ్వరు? వారి కిఁక గతియేమి? ఎవ్వరు వారిబాగు కోరి పరితపించువారు? అహా! వారికి విద్యలేదే! దిక్కులేదే! దివాణములేదే! వారికి దారి చూపువా రెవ్వరు? సోదరు

లారా! ఈదీనులే మీదైవమని భావింపుఁడు—వారిని గూర్చియే చింతింపుఁడు — వారికోసమే కృషిచేయుఁడు. అహర్నిశము వారిక్షేమార్థమే ప్రార్థింపుఁడు—భగవంతుఁడు మీకు దారి చూపును. పేదలనిమిత్త మెవ్వఁడు పరితపించునో వాఁడే, మహాత్ముఁడు, పరితపింపనివాఁడు దురాత్ముఁడే. మన మందఱమేకమై వారి శ్రేయస్సునకుఁగాను ప్రార్థింతము. మన మెంతటిమనిషియైనను లోకమునకుఁ దెలియకపోవచ్చును, లోకము మనలనుగూర్చి జాలినైనను బొందకపోవచ్చును, ఏమియు సాధింపకయే మనము గతించినను గతింప వచ్చును—కాని సదాశయ మొక్కటియు వినష్టము కాదు. ఇప్పుడో, యుగాంతముననో, ఫలము గలిగితీరును. నా హృదయ పరితాపమెట్టిదో తెలుపఁజాలను—...లక్షలకొలఁది మంది స్వదేశీయు లజ్ఞులై, క్షుధార్తులై దినములు గడుపుచుండ, వారిని గ్రేగంటనైనను జూడక, వారి నధఃపాతాళమునకు దిగఁ ద్రొక్కి తాము విద్యావంతులైన వారందఱును దేశద్రోహులని నాయభిప్రాయము. పేదలనెత్తురు పీల్చి, తమ సిరిసంపదలను సంపాదించి, క్షుధార్తులై మృగప్రాయులై మనుచున్న యిరు వదికోట్లజనుల బాగోగుల నిసుమంతయుఁ దలపెట్టక, మేలి దుస్తులను నగలను సింగారించుకొని కులుకుచు సంచరించు వారి నేమనవచ్చునో తెలియకున్నది! సోదరులారా! మనము నిర్ధనులమాట నిజమే, ఊరును పేరును లేనివారమనుట నిజమే; కాని యిట్టివారే భగవత్కార్యముల నొనర్చుటకు

సాధనభూతులై యున్నారు. మిమ్మందఱను బరమేశ్వరుఁ డనుగ్రహించుఁగాక !

కోట్లకొలఁది మన సోదర దేశీయు లన్నవస్త్రములు లేక యల్లాడుచుండ, మననోట నొకముద్ద నెట్లు పెట్టుకొనఁ గలము?—మన కెట్లు వచ్చును? నేను బశ్చిమఖండమున నుండఁగాఁ దల్లి నిట్లు ప్రార్థించితి ననేకపర్యాయములు : "ఓ లోకైకజననీ! ఇచ్చట నీపుత్రు లఖండభోగైశ్వర్యములఁ దేలియాడుచుండ, నచట నీ భారతపుత్రులు తినఁ దిండిలేక మాడుచున్నారు. తల్లీ! వారి కిఁక గతిలేదా?" నా సోదర దేశీయుల నెట్లైన నుద్ధరించు నవకాశములను గడింపఁ జూచుటే నా పశ్చిమఖండయాత్రకుఁ గల ముఖ్యకారణమని మీరంద ఱెఱిఁగినదే. వారి దుఃఖమును దారిద్ర్యమును జూచి నే నిట్లు తలంతును: "మన దేవతారాధనార్భటమునంతను నావలఁ ద్రోసివేయుదము. మన విద్యాగర్వమును శాస్త్రజ్ఞానదంభమును నాత్మమోక్షము నకై మనము నేర్చినసాధనల నన్నిటిని ద్రోసిపుచ్చి, యూరూరఁ దిరిగి, దరిద్రనారాయణసేవకై మనజీవితములను ధారపోయుదము మన నియమనిష్ఠలచే, బవిత్రవర్తనముచేఁ, బారమార్థికజీవనముచే, ధనికులను జనసామాన్యమునెడఁ గల ధర్మములను విధ్యుక్తమును దెలిపి. ధన మార్జించి, దరిద్రులను దీనులను సేవింతము." ఆహా! దీనులను, దరిద్రులను, ఆర్తులను గూర్చి దేశమున నొక్కఁడును జింతింపఁడు కదా! దేశమునకు వెన్నెముకలైన, తమ

జీవితమును ధారపోసి మన కాహారమును గూర్చుచున్న దీనజనుల కష్టసుఖములలోఁ బాల్గొనువాఁడు, వారియందు సానుభూతిఁ జూపువాఁడు దేశమున నొక్కఁడైన నున్నాఁడా? ఒక్కదినము వారు సమ్మెకట్టినచో, దేశమంతయు నట్టుడికిన ట్లుడికిపోవునే! తమసోదర హిందువులు తమ్మాదరింపకుండుటచేఁ జెన్నరాష్ట్రమున వేలకొలఁది పంచము లెట్లు క్రైస్తవులై పోవుచున్నారో కనుఁడు! కేవల మాఁకలి బాధచే, దారిద్ర్యముచేఁగాదు, వారు క్రైస్తవమత మవలంబించుచుండుట. మీరు వారిని మానవమాత్రులుగాఁ జూడకుండుటచేత! ఎంతసేపు, 'మీ రస్పృశ్యులు, అవాచ్యులు: నన్ను ముట్టుకొనకుఁడు, నన్ను ముట్టుకొనకుఁ'డని మొగిరిపడుచున్నారు! గగ్గోలు చేయుచున్నారు! సోదరభావము, గాని, ధర్మలేశముగాని దేశమున నేమైనను మిగిలియున్నదా! అస్పృశ్యత యొకటియే యిపుడు నిలిచియున్నది! ఇట్టి తుచ్ఛాచారములను జెనకివేయుఁడు! 'ఓ దీనులారా? దరిద్రులారా! అధఃపతిత సోదరులారా! రండు, మన మందఱము రామకృష్ణునిబిడ్డల' మని యెలుగెత్తి చాటుచు, జనులలో నైకమత్యమొనఁగూర్చుటకై యస్పృశ్యతావరణము నూడఁబెఱికివేయు సుదినమెపుడు ప్రాప్తించునో కదా! 'అస్పృశ్యుల' నుద్ధరింపనిదే మనభారతాంబ మేల్కొనదు. మనము వారి కన్నవస్త్రములను సమకూర్పఁ జాలనిచో, బ్రదికియుండి యేమి ప్రయోజనము?

వారీమాయాప్రపంచధోరణి నెఱుఁగని యమా

యకు లగుటచే శేయింబవల్లు, యమయాతనపడియు జీవనో
పాధి నార్జించుకొనలేకున్నారు. మీ యావచ్ఛక్తితోడను
వారల నావరించియున్న యజ్ఞత్వమును దొలఁగింపుఁడు.
కరతలామలకమై విస్పష్టముగా నాకుఁ గాన్పించుచున్న
దేమన, నాయందున్న బ్రహ్మమే, పరశక్తియే వారియందును
గలదు. వ్యక్తీకరణమునఁ దారతమ్య ముండుఁగాక. జాతీయ
తానది దేశమందంతటను బ్రవహించిననేకాని ప్రపంచ
ములో నే జాతియైనను నభివృద్ధిపొందినదా? పక్షవాతముచే
శరీరములో నొక్కయవయవము పడిపోయినచో, మిగిలిన
వన్నియు నెంత పటువుగానున్నను, ఆశరీరమువలన నంతఁగా
ఘనకార్యములు జరుగఁజాలవని గ్రహింపుఁడు — ఇది
నిశ్చయము.

ప్రేమయే విజయసింహాసన మధిష్ఠించునది. మీసోదర
మానవులను మీరు ప్రేమింతురా? దేవు నెచట వెద
కుట?— ఈ పేదలును, ఈ దుఃఖితులును, ఈ దుర్బలులును
దైవస్వరూపులుకారా? ముందుఁగా వారల నేల యర్చింప
రాదు? గంగానదీకూలమున నూతులు త్రవ్వనేల? ప్రేమ
యఖండమహిమాన్వితమగు చింతామణి యని నమ్ముఁడు.
పేరుప్రతిష్ఠ లనెడి గాజుకాళ్లెవరికిఁ గావలయును? మీకుఁ
బ్రేమ కలదా?— ఉన్నచో, మీ రఖండశక్తిమంతులు.
మీరు స్వార్థరహితులేనా? ఐనచో హరిబ్రహ్మాదులైనను
మిమ్మడ్డుకొనఁజాలరు. ఎల్లెడలను శీలమే మహిమాన్వి
తము.... ఈర్ష్యను నహంభావమును విడనాడుఁడు. ఇతరు

జీవితమును ధారపోసి మన కాహారమును గూర్చుచున్న దీనజనుల కష్టసుఖములలోఁ బాల్గొనువాఁడు, వారియందు సానుభూతిఁ జూపువాఁడు దేశమున నొక్కఁడైన నున్నాఁడా? ఒక్కదినము వారు సమ్మెకట్టినచో, దేశమంతయు నట్టుడికిన ట్లుడికిపోవునే! తమసోదర హిందువులు తమ్మాదరింపకుండుటచేఁ జెన్నరాష్ట్రమున వేలకొలఁది పంచములెట్లు క్రైస్తవులై పోవుచున్నారో కనుఁడు! కేవల మాఁకలిబాధచే, దారిద్ర్యముచేఁగాదు, వారు క్రైస్తవమత మవలంబించుచుండుట. మీరు వారిని మానవమాత్రులుగాఁ జూడకుండుటచేత! ఎంతసేపు, 'మీ రస్పృశ్యులు, అవాచ్యులు: నన్ను ముట్టుకొనకుఁడు, నన్ను ముట్టుకొనకు'డని యెగిరిపడుచున్నారు! గగ్గోలు చేయుచున్నారు! సోదరభావము, గాని, ధర్మలేశముగాని దేశమున నేమైనను మిగిలియున్నదా! అస్పృశ్యత యొకటియే యిపుడు నిలిచియున్నది! ఇట్టి తుచ్ఛాచారములను జెనకివేయుఁడు! 'ఓ దీనులారా! దరిద్రులారా! అధఃపతిత సోదరులారా! రండు, మన మందఱమూ రామకృష్ణునిబిడ్డల' మని యెలుగెత్తి చాటుచు, జనులలో నైకమత్య మొనఁగూర్చుటకై యస్పృశ్యతావరణము నూడఁబెఱికివేయు సుదినమెపుడు ప్రాప్తించునో కదా! 'అస్పృశ్యుల' నుద్ధరింపనిదే మనభారతాంబ మేల్కొనదు. మనము వారి కన్నవస్త్రములను సమకూర్పఁ జాలనిచో, బ్రదికియుండి యేమి ప్రయోజనము?

వారీమాయాప్రపంచధోరణి నెఱుఁగసి యమా

యకు లగుటచే రేయింబవళ్లు, యమయాతనపడియు జీవనో పాధి నార్జించుకొనలేకున్నారు. మీ యావచ్ఛక్తితోడను వారల నావరించియున్న యజ్ఞత్వమును దొలఁగింపుఁడు. కరతలామలకమై విస్పష్టముగా నాకుఁ గాన్పించుచున్న దేమన, నాయందున్న బ్రహ్మమే, పరశక్తియే వారియందును గలదు. వ్యక్తీకరణమునఁ దారతమ్యముండుఁగాక. జాతీయ తానది దేశమందంతటను బ్రవహించిననే కాని ప్రపంచ ములో నే జాతియైనను నభివృద్ధిపొందినదా? పక్షవాతముచే శరీరములో నొక్కయవయవము పడిపోయినచో, మిగిలిన వన్నియు నెంత పటువుగానున్నను, ఆశరీరమువలన నంతఁగా ఘనకార్యములు జరుగఁజాలవని గ్రహింపుఁడు — ఇది నిశ్చయము.

ప్రేమయే విజయసింహాసన మధిష్ఠించునది. మీసోదర మానవులను మీరు ప్రేమింతురా? దేవు నెచట వెద కుట?— ఈ పేదలును, ఈ దుఃఖితులును, ఈ దుర్బలులును దైవస్వరూపులు కారా? ముందుఁగా వారల నేల యర్చింప రాదు? గంగానదీకూలమున నూతులు త్రవ్వనేల? ప్రేమ యఖండమహిమాన్వితమగు చింతామణి యని నమ్ముఁడు. పేరుప్రతిష్ఠ లనెడి గాజుకూళ్లెవరికిఁ గావలయును? మీకుఁ బ్రేమ కలదా?— ఉన్నచో, మీ రఖండశక్తిమంతులు. మీరు స్వార్థరహితులేనా? ఐనచో హరిబ్రహ్మాదులైనను మిమ్మడ్డుకొనఁజాలరు. ఎల్లెడలను శీలమే మహిమాన్వి తము.... ఈర్ష్యను నహంభావమును విడనాడుఁడు. ఇతరు

లతోఁ బొత్తు కలిగి లోకసేవ చేయ నేర్చుకొనుఁడు. ఇదియే మన దేశమున కత్యావశ్యకము. తాలిమి వహించి మరణము సంభవించినను సరియే శ్రద్ధను విడనాడకుఁడు. మీలో మీరు తగవులాడకుఁడు. ద్రవ్యవిషయమున నకలంకులై యుండుఁడు. శ్రద్ధ, నిష్కాపట్యము, భక్తియు మీయొద్ద నున్నచో నన్నియు నభివృద్ధి నొందును. మీలో మీకుఁ గక్షలు లేకున్నంతవఱకు, భగవదనుగ్రహమున మీకే భయమును లేకుండునని నా నిశ్చయము. నిజముగా లాభకరమగునని మీకుఁ దోఁచిననేకాని మీ హృద్గతవిషయములను బైకిఁ జెప్పకుఁడు. పరమశత్రువువిషయమునఁగూడఁ, బ్రియకరము, హితకరమునగు మాటలనే విని యోగింపుఁడు.

వికాసమే జీవనము, సంకోచమే మరణము, సమస్త ప్రేమయు వికాసమే, సమస్తస్వార్థపరతయు సంకోచమే. కావునఁ బ్రేమయే జీవననియమము, ప్రేమగలవాఁడే సజీవుఁడు. స్వార్థపరుఁడు మృతప్రాయుఁడు. కావున నవ్యాజముగాఁ బ్రేమింపుము. అవ్యాజప్రేమయే జీవననియమము.

లోకహిత మొనర్చుటయే మన యాశయము కాని మన పేరుప్రతిష్ఠలను జాటుకొనుట కాదు.

అంతఃకలహములను గక్షలను బురికొల్పుట, ఆత్మశ్లాఘనము, ఒరులను జూచి యసూయపడుటయు నను నీ మూఁటిని మీలోఁ బ్రతివ్యక్తియు శాశ్వతముగా విడనాడవలయునని నేను గోరెదను. భూమాతవలె మీరు క్షమా

పూర్ణులై యుండవలయును. ఇది మీరు సాధించుచో ముజ్జగములును మీకుఁ బాదాక్రాంతమగును.

ఆజ్ఞాపాలనమును నేర్చినవాఁడే యాజ్ఞాపింపఁజాలును. మొదట విధేయత నలవఱచుకొనుఁడు. మనకుఁ గావలసినది సంఘీభావము, కట్టుపాటు. సంఘీభావమే శక్తి, విధేయతయే యందలి రహస్యము.

లోకహిత మొనర్పఁదలఁచినవారు తమ సుఖదుఃఖములను, పేరుప్రతిష్ఠలను, స్వార్థపరమగు సమస్తమును గట్టకట్టి గంగలోఁ గలిపి మఱి భగవంతు నాశ్రయింపవలయును. జగద్గురువు లందఱును జెప్పినదియుఁ జేసినదియు నిదియే.

పక్షపాతమే సమస్తదోషములకును మూలమని గ్రహింపుము.

నా సోదర దేశీయులకు నన్నుదోడ్పడనిండు—ఇదియే నా యాశయము, నా కోరిక.

ఏమైనను శ్రేయము కలుగవలెనని మీరు కోరుచో, మీ కర్మకలాపములను దేవతారాధనార్భటమును గంగలోఁ గలిపి, సజీవదైవమును—మానవదైవమును—ప్రతిమానవ స్వరూపుని—విరాడ్రూపమునను వ్యక్తిరూప[illegible]ను దేవు—నారాధింపుఁడు.

జాలిచే నొరులకు మేలు చేయు[illegible] మంచిదే, కా[illegible] సమస్తజీవులును భగవత్స్వరూపము[illegible]యను భావమున సేవచేయుట మేలు.



వలయునది శాంతము, నిరాడంబరము, అచంచలము నైన కృషి—అంతియేకాని వార్తాపత్రికావంచన కాదు, పేరుప్రతిష్ఠలకై యుబలాటము కాదు,— ఈ సంగతి సదా జ్ఞప్తి నుంచుకొనుఁడు.

మానవజీవిత సమస్యలను గూర్చియు, నాత్మతత్త్వమునుగూర్చియు లోకమునకు బోధింపవలయు మహాభారము భారతపుత్రులపై నున్నది. అందులకై మీరు సంసిద్ధులు కావలయును.

నాయనలారా ! నా మాట వినుఁడు, భగవదనుగ్రహమునఁ గీలకమును గనుఁగొంటిని. మతమున—ధర్మమున—నే దోషమును లేదు. సమస్తజీవులును గోటిగుణితమైన మీయాత్మయేయని మీమతము—మీ సనాతనధర్మము—బోధించుచున్నది. ఏ తదనుష్ఠానలోపము, సానుభూతి లోపము—ఉన్నలోప మిది.... యూదులు ఏసు ప్రభునిఁ గాదని, నాఁటినుండియుఁ బ్రతివానిచేతను మొట్టికాయలను దినుచుఁ, గొంపయును గోడును లేక, ప్రపంచమంతటను బికారివాండ్రై యెట్లు తిరుగుచున్నారో యట్లే మీరును మిమ్ములను బాలించుట పాడియని తోఁచిన జాతికెల్ల దాస్యము చేయుచున్నారు.

ఓ క్రూరులారా ! మన దేశమున నొకవైపున మీ క్రూరశాసనములును మఱియొకవైపున నీచదాస్యమును తాండవించుచుండుట మీకు గోచరించుట లేదా !

ఎచట మహామారియో, కాటకమో వెలువడునో,

లేక యెచట జనులు దుఃస్థితిలోనుందురో, యచటికి మీరంద ఱును వెడలి వారల బాధలను దొలఁగింపుఁడు. మహా వైపరీ త్యము సంభవించినచో, నేతత్ప్రయత్నమున మీరు చనిపో వచ్చును; ఐననేమి? ప్రతిదినము మీ వంటివా రెందఱు కీటక ములవలెఁ జనిపోవుచుండుట లేదు? ఈ విశాలప్రపంచమునకు దానివలనఁ గలుగు భేదమేమి? చనిపోవు టెన్నఁటికైనను దప్పదు, కాని యొక మహాదర్శమునిమిత్తము మరణింపుఁడు, జీవితమున నొక మహాదర్శముతో మరణించుట మేలుకదా? ఈ యాదర్శమును వాడవాడలందును నింటింటను బ్రచార మొనర్పుఁడు, తన్మూలమున మీ దేశమునకు మేలొనఁగూర్పు టయేగాక మీరును మేలొందుదురు. భావిభాగ్యోదయ మునకు భారతమాత మీయందే యాశపెట్టుకొనియున్నది. మీ నిర్వ్యాపారజీవనము నాకెంతయో బాధ కలిగించు చున్నది. కార్యశూరులు కండు—కృషిచేయుఁడు. ఆల సింపకుఁడు—నానాఁటికి మృత్యు వాసన్నమగుచున్నది! కాలక్రమమున నెప్పుడో సర్వము జరుగునని, సోమరులై కూర్చుండకుఁడు. ఆ విధముగా నేమియు నెన్నఁడును జరుగ దని జ్ఞప్తి నుంచుకొనుఁడు.

శక్తి మొదలగునవన్నియు స్వయముగనే వచ్చును. కార్యదీక్ష నవలంబించినచో, మీరు భరింపరానంతటి శక్తి సామర్థ్యములు మీకుఁ గలుగును—మీ కిది యనుభూత మగును. పరహితార్థ మేలేశము మన మొనర్చినను నది యంతర్నిహితమగు శక్తిని మేల్కొల్పును; ఏల, పరశ్రేయ

మనుగూర్చి మన మేమాత్రము తలపోసినను గ్రమముగా
నది సింహబలమును మన హృదయమునఁ బురికొల్పును.
మీ యందఱియందును నాకెంతయో ప్రేమ, కాని పరహి
తార్థాచరణమున మీరు మరణింపవలయునని నేను గోరె
దను—మీ రట్లొనర్చుట నాకు విశేషానందదాయకము.

"నేను పేద" యని కుందకుము. అట్టి భావములను
బూర్తిగా విడనాడుము. ఏ విషయమున నీవు పేదవు? నీ
కొక గుఱ్ఱపు సారటును బరిజనమును, లేదా, నీ యాజ్ఞల
కెదురుచూచుచుండు భృత్యవర్గమును లేవనియా నీ పరితా
పము? అవి లేకపోయిన నేమి మునిఁగిపోయినది? నీ గుండె
నెత్తురు ధారపోసి యహర్నిశము పరశ్రేయమునకై పాటు
పడుచో, నీ కేకొఱంతయు నెట్లు లేకుండునో నీ కిసుమంతయుఁ
దెలియకున్నది!

హుక్కా నమర్చియైనను నొకని సేవించుట లక్షల
కొలఁది ధ్యానములకంటెను ఘనతరమని గ్రహించు నొకా
నొక సమయము వచ్చును.

ప్రతి కర్మఫలమును మంచిచెడుగులతో సమ్మిశ్రితమై
యున్నది. ఏ లేశమో దోషయుక్తముకాని సత్కార్యము
లేనేలేదు. అగ్ని నావరించు పొగవలె నెప్పుడును నేదో
కొంత చెడుగు కర్మముల నాశ్రయించి యుండును.* అతి

---

* సహజం కర్మ కౌన్తేయ సదోషమపి న త్యజేత్,
సర్వారంభా హి దోషేణ ధూమేనాగ్నిరివావృతాః. గీత, 18-48.

విశేషమగు మేలును నత్యల్పమగు కీడును గలుగఁజేయునట్టి కర్మములను మన మాచరించుచుండవలయును.

నీసాయము లేమిచే నొక చీమయైనను జనిపోవునని నీవు తలంతువా? అది మహాపరాధము! లోకమునకు నీయావశ్యకత యొంతమాత్రమును లేదు. భగవంతునికి సాయము చేయుటకుఁ గాక, భగవత్ప్రీతికొఱకుఁ గృషిచేయు మహావకాశము నొందుటచే మనము ధన్యులము. 'ఉపకార' మను మాటను నీ మనఃఫలకమునుండి తుడిచివేయుము. నీ వుపకారము చేయఁజాలవు: అది మహాపరాధము. నీవు సేవింతువు. సమస్తవిశ్వము నెడలను నట్టిపూజ్యమనోభావము నవలంబింపుము. అపుడు సంపూర్ణ సంగరాహిత్యము నీ కలవడును.

నేను బాలుఁడనై యుండ స్వమతాభినివేశము కర్మమున నొక విశేషాంశమని తలఁచితిని, కాని యిపుడు, వయఃపరిపాకమున, నట్లు కాదని తెలిసికొనుచున్నాను.

విధ్యుక్తమగు నే కర్మమునైనను నిరసింపఁదగదు. ఎవ్వఁడైనను దన విధ్యుక్తకర్మముల నెట్లాచరించున్నాఁడని మనము చూడవలయునే కాని యా విధ్యుక్త కర్మస్వభావముబట్టి యాతని యోగ్యతాయోగ్యతలను మనము పరిశీలింపఁ దగదు. చర్మకారుఁడు, వానివృత్తిని గర్మమును బట్టి,యత్యల్పకాలమునఁ జక్కని గట్టి చెప్పులజోడు తయారు చేయఁగలిగినయెడలఁ దన జీవితమునఁ బ్రతిదినము నర్థరహితప్రసంగములుచేయు నధ్యాపకునికంటె నధికుఁడు,

యోగ్యుఁడు. ప్రతి విహితకర్మమును బవిత్రమైనదియే, విహిత కర్మనిష్ఠ మహోత్తమమగు నీశ్వరారాధనము.

ప్రాణత్యాగ పర్యంతము కృషిచేయుఁడు—నేను మీ దండ నున్నాను, నేను గతించినపిమ్మట నాయాత్మ మీతోఁగూడి కృషిచేయును. ఈ జీవిత మస్థిరము—సిరి సంపదలు, పేరుప్రతిష్ఠలు, భోగములు—అన్నియు మూఁడు నాళ్లముచ్చటలు. లౌకిక కీటకమువలె నశించుటకంటె సత్యప్రకటన మొనర్చుచుఁ గర్తవ్యకర్మాచరణమునఁ బ్రాణములు కోల్పోవుట మేలు, ఎంతయో మేలు. ముందడుగు వేయుఁడు!

అసూయను, అహంభావమును విడనాడుఁడు. పొత్తు కలిగి పరశ్రేయమునకై పాటుపడ నేర్చుకొనుఁడు. మన దేశమున కిది యత్యావశ్యకము.

నాయనా! ఏ మానవుఁడును నేజాతియుఁ బరులను ద్వేషించి మనఁజాలదు. పరదేశీయులతో సంసర్గమును విరమించి, యేనాఁడు హిందువులు 'మ్లేచ్ఛ' శబ్దమును సృజించిరో, యానాఁడే హిందూదేశమునకు దౌర్భాగ్యము ప్రాప్తించినది.

ధనికులను నమ్మకుఁడు, వారు వట్టి జీవచ్ఛవములు. వత్సలారా! సంఘమున సామాన్యులయ్యును, వినయవిధేయులగు మీయందే నే నాశపెట్టుకొని యున్నాను. భగవానుని నమ్ముఁడు; యుక్తిలో, తంత్రములో, నేమున్నది? దీనుల సముద్ధరణమునకై పరితపింపుఁడు. సాయ మయాచితముగా

వచ్చితీరును...యువకులారా! దరిద్రులను, దీనులను, అజ్ఞులను లేవనెత్తు నీ సానుభూతిని, ఈ కార్యదీక్షను, ఈ పోరాటమును స్థిరాస్తిగా నేను మీ కొసంగుచున్నాను. ఈనిముసమున నే పార్థసారథి దేవాలయమునకు వెడలి, గోకులమందలి పేద గోపబాలకుల నెచ్చెలియగు నా దీనబాంధవునకు—అంత్యజుం డగు గుహు నాలింగన మొనర్చుకొన వెనుదీయుని యాభక్త వత్సలునకు—తన బుద్ధావతారమున నున్నతవంశజుల యాహ్వానములను విడిచిపుచ్చి, యొక వ్యభిచారిణి యాహ్వానము నంగీకరించి యామెను బ్రోచిన యా పతితపావను నకు—ఆ పార్థసారథికి—సాష్టాంగవందన మొనర్చి, యెవ్వరి నిమిత్తము యుగయుగములం దాతఁ డావిర్భవించునో, విశేష, మే దీనుల, నే పేదల, నే యధఃకృతుల నాతఁడు మిగులఁ బ్రేమించునో వారికై మహాత్యాగ మొనరింపుఁడు, మీ యావజ్జీవితము వారికై ధారవోయుఁడు. నానాఁటి కధఃపతనము జెందుచున్న యీ ముప్పదికోట్ల దీనుల నుద్ధ రించుటకై మీ యావజ్జీవితమును ధారవోయఁ బ్రతిన బూనుఁడు....శుష్కరచయితలను, సానుభూతిరహితము లగు వారి వార్తాపత్రికావ్యాసములను వీసమైనను లక్షింప కుఁడు. వలయున దుజ్జ్వలమైన విశ్వాసము, సముజ్జ్వలమైన సానుభూతి! జననములేదు, మరణములేదు—ఆఁకలిలేదు, దప్పిలేదు! పరమేశ్వరుని స్మరింపుఁడు—ముందునకు సాగి పొండు. పరమేశ్వరుఁడే మన నాయకుఁడు. పడిపోయినవారికై వెనుకకుఁ జూడకుఁడు! సోదరులారా! ఇదియే మార్గము!

...కమునకు మనము మేలొనర్పఁగలమా? పార మార్థికముగాఁ జూచినచో (మనవలనఁ) గాదనియు, వ్యావహారికముగాఁ జూచినచో 'నౌ'ననియుఁ జెప్పవలసియున్నది.

నాయనలారా! మనమందఱము శ్రమపడి కృషి చేయుదము, నిద్రించుట కిది సమయము కాదు. భావిభారతము మనకృషిపై నాధారపడియున్నది. భారతమాత వేచియున్నది. ఆమె యూరక నిద్రించుచున్నది. లెండు, మేల్కొనుఁడు, మునుపటికంటెను విశేషవైభవోపేతయై, పునర్జీవితయైయుండుటనామె తన శాశ్వతసింహాసనము నధిష్ఠించి యుండుటఁ గనుఁడు!

శివుని సేవింపఁగోరువాఁడు ముందాతనిబిడ్డలను సేవింపవలయును—ప్రపంచమందలి సమస్తజీవులను సేవింపవలయును. భగవత్సేవకులను సేవించువా రాతనిసహోత్తమ సేవకులని శాస్త్రములలోఁ జెప్పఁబడియున్నది. స్వార్థరాహిత్యమే మతధర్మములకు గీటురాయి. స్వార్థరాహిత్యము నెంతవిశేషముగాఁ గలిగియుందుమో మనమంతటి పారమార్థికులము, శివసన్నిహితులమునైయుందుము. సమస్త దేవాలయములను జూచినను, సమస్తతీర్థములను సేవించినను, నొడలినిండఁ జిఱుతపులివలె రంగులు ధరించినను, స్వార్థపరులమైయున్నచో, శివున కతిదూరస్థులమే.

నేఁడు (పూజామందిరమున) మీ కొకఘంట, రేపు దానిపైన నొకజేగంట, మఱునాఁ డొకచామరము; లేదా, నేఁ డొకశయ్య, మఱునాఁడు దానికోళ్లకు వెండిమలామా—

ఇఁక భక్తులకుఁ బరమాన్నమును బిండివంటలును; ఇఁకఁ దలయుఁ దోఁకయు లేని వేఱుగాథలు—వేయేల, బాహ్య కర్మకలాపము—ఇదియే కదా మీ కార్యక్రమము! మీ ధోరణి! దీని కాంగ్లమున Imbecility (బుద్ధిమాంద్యము) అని పేరు ఈవిధమైన కుజ్జుతనపుఁ జేష్టలకంటె మఱేమియుఁ దలకెక్కనివారే Imbeciles (బుద్ధిహీనులు) అనఁబడుదురు. గంట కుడివైపున వాయించవలెనా?—చందనపుబొట్టు నుదుటనే పెట్టవలెనా, మఱెచ్చటనైననుగూడఁ బెట్ట వలెనా?—హారతి మూఁడుసార్లీయవలెనా, నాలుగు సార్లీయవలెనా?—ఈవిధమైన సమస్యలతో నహర్నిశ మెవ రించుమించుగాఁ గలవరపడుచుందురో వారే Wretches (నిర్భాగ్యులు) అనఁబడ నర్హులు. ఈ ధోరణిచేత నే యభాగ్య దేవతకు బలియై ప్రతివారిచేతను సేవగించుకొనఁబడుచుఁ బ్రతివారికిని లోకువయై మనము మొట్టికాయలను దన్నులను దినుచున్నాము. పాశ్చాత్యులో, ప్రపంచాధిపతులై యున్నారు...త్యాగవైరాగ్యములకును సోమరితనమునకును హాస్తిమశకాంతరము.

అభ్యుదయము నొందవలయుననిన, మీ కర్మకలాప ములను గంగలోఁ గలిపి, సజీవదైవమును మానవదైవ మును—ప్రతిమానవరూపుని—విశ్వమున నేకాక, ప్రతి వ్యక్తియందును వెలయు భగవంతు—నారాధింపుఁడు, భగవానుని విశ్వరూపమే యీ ప్రపంచము, తదర్చనమే, లేక సేవనమే, కర్మాచరణము, కర్మకలాపములందును

ఆచారములందును నిమగ్నులై యుండుట కాదు. అన్నపుఁ బళ్లెరము దేవునిముందు పదినిముసము లుంచవలయునా? అఱగంటసేపుంచవలయునా? యని యాందోళనపడుటయుఁ (గర్మము) గాదు,—అది మతిభ్రమ. కాశీయందును బృందావనమందును దేవాలయపుఁదలుపులు తెఱచునపుడు కాని, మూయునపుడుకాని, తదాదిగా నవి దినమంతయు గణగణమ్రోఁగుటకుఁగాను లక్షలకొలఁది రూప్యములు వ్యయింపఁబడినవి! ఇపుడు దేవున కలంకారసమయము. ఇపు డారగింపుసమయము, ఇపుడు మనకుఁ దెలియని మఱేమియో సమయము...ఇఁక నిదియంతయు సజీవప్రత్యక్ష దైవము తిండిలేక మలమల మాడుచున్నప్పుడు, చదువులేక 'యలో, లక్ష్మణా!' యని విలపించుచున్నప్పుడు! తోడి మానవులకుఁ బ్రాణముమీఁదికి వచ్చినను వారేమియుఁ జేయరు కాని బొంబాయిలోని బనియాలు (వైశ్యులు) నల్లుల యోగక్షేమార్థ మాసుపత్రులను గట్టించుచున్నారు! ఈ యల్పవిషయము గ్రహింప మీకు బుద్ధిబలము చాలకున్నది—ఇదియే మన దేశమునకు ముప్పు, పిచ్చిసంస్థలు మన దేశమునఁ గుప్పతిప్పలు.

...ప్రచండదీక్షతో, మహోత్సాహముతో మీలోఁ గొందఱు నలుదిక్కులకును వెడలి మన దేశమున నింతవఱ కెవ్వరును నిర్వహింపని యీ విశ్వరూపారాధనప్రచారము సాగింపుఁడు.

గుళ్లలో (అగ్రవర్ణజుల) ఏమి యొడలెఱుఁగని

సివము! పేదలదుఃస్థితిని దొలఁగింపఁజాలనిమతము—మానవులను దేవతలుగా నొనర్పఁజాలని మతము—మత మనఁదగునా? ధర్మ మనఁదగునా? సనాతనధర్మ మనిపించుకొనుటకు మనమతమున కేమైన నర్హత కలదా? మనది కేవలము "నన్ను ముట్టుకోకు మను మతము"—"నన్ను ముట్టుకోకు, నన్ను ముట్టుకోకు"—ఇదియే మన జపము! శ్రీరామ రక్ష! "కుడిచేతితోఁ దినవలయునా, యెడమచేతితోఁ దినవలయునా, పానీయము కుడివైపునుండి గ్రహింపవలయునా, యెడమవైపునుండి గ్రహింపవలయునా?..." అనియే రెండు వేలయేండ్లుగా దేశనాయకులు చర్చించుచున్న దేశము కానిచో మఱియే దేశ మధోగతిపాలగును? "కాలః సుప్తేషు జాగర్తి కాలో హి దురతిక్రమః"—సమస్తము నిదురించుచుండఁగాఁ గాలము మేల్కొనియుండును, దురతిక్రమము గదా కాలము! అంతయుఁ బరమాత్మున కెఱుక, నాయనా! వాని కనుమాయఁ గలవాఁ డెవ్వఁడు?

లక్షలకొలఁదిజను లిప్పపువ్వులు తిని బ్రదుకవలసిన దేశము, ఏ యిరువదిముప్పదిలక్షలమందియో సాధువులును, ఏ పదికోట్లమందియో యగ్రవర్ణజులును గలనైనను వారి శ్రేయస్సునుగూర్చి తలపెట్టక, వారి రక్తమాంసములను బీల్చి పిప్పిచేయుచున్న దేశము దేశమా? నరకమా? అది ధర్మమా, పిశాచతాండవమా? నాయనా! నీ వీసంగతి బాగుగా గ్రహింపవలయును—భారతదేశమం దంతటను బయనించినాను, ఈ దేశము (అమెరికా)ను జూచినాను—

కారణము లేని కార్యముండునా? పాతకము లేని దే దుఃఖాను భవము గలుగునా?

> సర్వశాస్త్ర పురాణేషు వ్యాసస్య వచనం ధ్రువమ్,
> పరోపకారస్తు పుణ్యాయ పాపాయ పరపీడనమ్.

సర్వశాస్త్రపురాణములందును నీవ్యాసవచనము ధ్రువము—పరోపకారమే పుణ్యము. పరపీడనమే పాపము. కాదా?

(ఇట్టివారి) ఆచారములలో, సాధనలలోఁ గల తత్త్వార్థము సంగ్రహముగా నిది: "నేను బరిశుద్ధుఁడను, లోకమంతయు నశుద్ధము!" పరమనికృష్టమతము, పాషండ మతము, ఘోరరాక్షసమత మిది!...ఇఁక వీరు చేయుచున్న ఘనకార్యములో!—"వంకాయ బంగాళాదుంపను దాఁకిన పక్షమునఁ బ్రళయము సంభవింపకుండఁ బ్రపంచ మెంత కాలము నిలుచును?" "చేతులు శుద్ధిచేసికొనుటకుఁగాను బండ్రెండుసార్లు మట్టివైచి తోముకొనినపక్షమునఁ బితరులు పదునాలుగుతరములవారా, అధోగతిపాలగువారు, ఇరువది నాలుగుతరములవారా?" జనాభాలో నాలుగవవంతు తిండిలేక పస్తుపడియుండఁగా నీవిధమైన ధర్మసూక్ష్మములను రెండువేల యేండ్లనుండి చర్చించుచున్నారు,—ఇందులకు శాస్త్రీయోపపత్తులను గనుఁగొనుచున్నారు. ఎనిమిదేండ్లపిల్లను ముప్పదియేండ్ల వాని కిచ్చి తల్లిదండ్రులు బ్రహ్మానందపడుచున్నారు. దాని నెవ్వరైనను బ్రతిఘటించిన యెడల, "మామతము ధ్వంసమై పోవుచున్న"దని పెద్దగోల! ఇట్టివారిమతము నేమనవచ్చును?

మనయందలి దైవాంశము వ్యక్తమగుటకుఁ బరులకుఁ దోడ్పడుటయే మార్గము.

ఎవ్వఁడు మానవసేవ చేయునో వానికి మోక్షము కరతలామలకము.

అకలంకులమై లోకహితమొనర్చుటయే సమస్తారాధనమునకును సారాంశము. పేదలలో, దీనులలో, మూర్ఖులలో, రోగులలో నెవ్వఁడు శివుని గాంచునో వాఁడే శివారాధకుఁడు, ఇఁక విగ్రహమునమాత్రమే శివుని గాంచుచో, వానియారాధనము కేవల ప్రారంభావస్థయందున్న దన్నమాట. కేవల దేవాలయములలో శివునిఁ గాంచువానియెడఁ గంటె జాతిమతభేదాదులను గణింపక, యొక దీనునియం దెవ్వఁడు తన్నుఁ గాంచి యాతనికిఁ దోడ్పడునో, సేవించునో, శివుఁడు వానియెడ విశేషప్రసన్నుఁడగును.

ఎవఁడు జీవారాధకుఁడో వాఁడే శివారాధకుఁడు.

భక్తిని వీడి, హృదయమును శుష్కించఁజేసికొని, ప్రేమానురాగములను మంటఁ గలిపి, సంఘమునకు వెలియైననినఁనే కాని జ్ఞానము లభింపదని సామాన్యముగా లోకుల భావన. ఆత్మసాధన కంతరాయములనెడి దుర్భావమున సోదరమానవులయెడలను జీవకోటియెడలను నిట్లు ద్వేషభావమును వహించి సాధకుఁడు పెడత్రోవ త్రొక్కుచుండును. కాని శ్రీరామకృష్ణుఁడు తన దివ్యభావమునఁ బల్కిన... మహోపదేశవాక్కులవలన, మానవుఁ డింటనుండియో, యతులును దాపసులును సంఘమును వీడి యొనర్చునట్టి

తత్త్వజ్ఞానసాధన నొనర్పవచ్చునని నాకు విశదమైనది;—వేదాంతము నిత్యకృత్యములందనుష్ఠానమునఁ జూపఁదగునని నాకు విశదమైనది. మానవుఁ డేయాశ్రమముననున్నను, నే వృత్తి నవలంబించుచున్నను సమస్తజీవకోటియు సాక్షాద్భగవత్స్వరూపమేయని గ్రహించుఁగాక!...మానవసేవయే మాధవసేవ.

ఎవ్వని విశ్వాసమును—శ్రద్ధను—జెడఁగొట్టఁబ్రయత్నింపకుము. చేతనైనచో, వాని కున్నదానికంటె విశేష మొసఁగుము; వాని యథాస్థితిని గ్రహించి యందుండి పురోభివృద్ధి గల్గింపుము, అంతియే కాని వాని కున్నదానిని బాడుచేయకుము.

మనప్రార్థనలలో భగవంతుఁడు మనకందఱకును దండ్రియని సమ్మతించుచు, నిత్యకృత్యములలోమాత్రము ప్రతిమానవుని మనసోదరునిగా గణింపనిచో దానివలన నేమి లాభము?

ప్రకృతి యెప్పుడును బానిసనుదుట నుంచు గుఱుతును—అసూయ యనుమచ్చను—మొట్టమొదటఁ జెఱిపివేయుదము. ఎవ్వరియెడలను నసూయపొందకుఁడు. మేలు చేయు ప్రతివ్యక్తికిని జేయూఁతనొసఁగసంసిద్ధులైయుండుఁడు. త్రిలోకములందును, ప్రతివ్యక్తికిని బ్రతిజీవికిని శుభము కలుగవలయుననియే సంకల్పింపుఁడు.

సముద్రమునే లక్షింపుము; అలను లక్షింపకుము. చీమకును దేవతకును భేదము నెంచకుము. ప్రతికీటకమును

యేసుక్రీస్తుసోదరుఁడే. అట్టిచో నొకరెక్కువవారనియు మఱి యొకరు దక్కువవారనియు నెట్లు చెప్పఁగలవు? తనధర్మము ననువర్తించు ప్రతివ్యక్తియు మహనీయుఁడే.

ఎంతవఱకు "నన్ను ముట్టుకోకు" మను మంత్రజపమే మీమతమై, వంటకుండలే మీ దేవతలై యుండునో, అంత వఱకుఁ బారమార్థికముగా మీరు పైకి రాఁజాలరు.

పరహితార్థ మొకజీవితము నర్పింపఁజాలరా? వేదాంతశ్రవణము, ధ్యానాదిసాధనలు మున్నగువానిని ముందుజన్మమునకు విడిచిపెట్టుఁడు! లోకసేవకై యీశరీరము నాహుతియొనర్పుఁడు!... తీవ్రతపస్సుచేసి నేను గ్రహించిన మహత్తరసత్యమిది: ప్రతిజీవియందును భగవంతుఁడు కలఁడు. దృశ్యమానమగు నీ సమస్తజీవకోటియు నాతని స్వరూపమే. భగవంతు నెచట వెదకుట! ఎవఁడు జీవారాధకుఁడో వాఁడే శివారాధకుఁడు:...

సమస్తజీవస్వరూపుని, అద్వితీయుని, విశేషము నాయార్తనారాయణుని, నాదీననారాయణుని, సమస్తదేశీయులకెల్లఁ బేదయగు నాభారతనారాయణుని,—నా యిష్టదేవత నర్చించుటకై యెన్నిజన్మములైన నెత్తెదనుగాక, యెన్నివేల బాధలనైన ననుభవింతునుగాక!

పవిత్రహృదయులు, ప్రచండదీక్షాదక్షులు, భగవద్విశ్వాసబలోపేతులు—దరిద్రులపై, దీనులపై, నధఃకృతులపై సానుభూతికతన సింహసాహసాన్వితు—లోకలక్షమంది స్త్రీపురుషులు—మోక్షసందేశమును, సంఘోద్ధరణసందేశ

మును, సమత్వసందేశమును జాటుచు యావద్భారతదేశ మునను సంచరింపవలసియున్నది.

" 'అన్న మో రామచంద్రా!' యని పలవించు నార్తులకు మతబోధ లెందులకు?" అని గురుదేవుఁడు (శ్రీరామకృష్ణుఁడు) వచింపలేదా? భారతజనసామాన్యము కేవల పశుప్రాయమై జీవించుటకుఁ గారణ మజ్ఞానము, అక్షర జ్ఞానశూన్యత. జనసామాన్యము నుద్ధరింపని మనకు జాతీయత యనునది కలలోని వార్త... కాని యీ దోషము సనాతనధర్మమున కంటఁగట్టుట తగదు, ఇయ్యది మన దోషము.

ఆత్మమోక్ష జగత్కల్యాణములనిమిత్తము ప్రపంచ మున సన్న్యాసి జన్మించుచున్నాఁడు. పరహితార్థము తన జీవితము నర్పించుటకై, ఆకసము నార్తనాదములచేఁ జిల్లులు వడఁజేయు దీనజనకోటి కష్టములను దొలఁగించుటకై, యనాథలకన్నీటి నాఁపుటకై, పుత్రశోకసంతప్తలగు తల్లుల నోదార్చుటకై, యజ్ఞానులు, నధఃపతితులు నగు జనులు స్వశక్తిపై నిలుచుటకు వలయు సదుపాయముల నొనఁ గూర్చుటకై, జాతిమతభేదములను గణింపక సమస్తమాన వకోటికి నిహపరసౌఖ్యదాయకమగు శాస్త్రబోధ లొనర్చు టకై, ప్రతివ్యక్తియందును నిద్రాణమైయున్న బ్రహ్మశక్తిని మేల్కొల్పుటకై సన్న్యాసి యీ లోకమున జన్మించు చున్నాఁడు.

అనాథలకన్నీటి నాఁపఁజాలని—వారలకడుపుఁజిచ్చుఁ

జల్లార్పఁ బట్టెఁడన్నమును బెట్టఁజాలని—ధర్మమనినను దేవుఁడనినను నాకు నమ్మకము లేదు. ఎంతగొప్పసిద్ధాంతములను బ్రకటించినను, నెంత బ్రహ్మాండమైన వేదాంతము చాటినను, పుస్తకములను వాదములను నంటిపట్టుకొని యుండు ధర్మమును నేను ధర్మమనఁ జాలను. కన్ను నుదుట నున్నది కాని వీఁపున లేదు. 'మా మతధర్మము' లని మీరు చెప్పుకొని గర్వించునట్టివాని నాచరణమునఁ జూపుఁడు, ముందంజ వేయుఁడు!

మనోవాక్కాయములను మీరు పరహితార్థము సమర్పింపవలయును. "మాతృదేవో భవ, పితృదేవో భవ" యని మీరు పఠించియున్నారు, కాని నేను, "దరిద్రదేవో భవ, మూర్ఖదేవో భవ" యని చెప్పెదను.—పేదలు, అజ్ఞులు, నిరక్షరాస్యులు, దీనులు—వీరినే మీరు దైవముగా భావింపవలయును. దీననారాయణసేవయే మహోత్తమధర్మమని గ్రహింపుఁడు.

హనుమన్మహావీరుఁడే మీ కాదర్శపురుషుఁడు. జితేంద్రియ చక్రవర్తియు నద్వితీయధీశాలియు నగు నాతఁడు రామనామమందలి యఖండభక్తిచేఁ బ్రాణభీతిని విడనాడి, యొక్క దుముకులో సముద్రము నెట్లు లంఘించెనో చూడుఁడు! భగవత్సేవకులమని గుర్తించి యట్టిమహోన్నతాదర్శము ననుసరించి మీ జీవితములను నియమించుకొనుఁడు....మీ రిట్టి దివ్యాదర్శమున సుప్రతిష్ఠితులైనచో, ఉన్నతాదర్శములును వాని నవలంబించు విధానములును నప్రయత్నముగా మీ-

కలవడును. సమస్తసంశయములను ద్రోసిపుచ్చి మీ గుర్వాజ్ఞను బాలింపఁ గంకణము గట్టుకొనుఁడు. అస్ఖలితబ్రహ్మచర్యము నవలంబింపుఁడు— ఇదియే పారమార్థికజీవనరహస్యము. వేఱుమార్గము లేదు. హనుమంతునిఁ గనుఁడు. ఆతఁ డెట్టి భగవత్సేవకుఁడో ! ఆదర్శమూర్తియో ! తనయఖండబాహుబలముచే, అద్వితీయపరాక్రమముచే రావణుని రాక్షససైన్యములను హాహాకార మెత్తింపఁగలిగిన మహావీరుఁ డాతఁడు. మఱియొకవైపున రామపదపంకజార్చకులలో నద్వితీయుఁడు నాతఁడే. రామచంద్రుని సేవించుటయే, రామాజ్ఞను బరిపాలించుటయే, యాతని జీవితేచ్ఛ. అందులకై యాతఁడు తనజీవితమును ధారపోయ సమకట్టెను.

## ఏడవ ప్రకరణము

## ప్రేమ

చ. "హృదయము విప్పి చెప్పెదు సు
హృద్వర ! యొక్కమహారహస్య మి
య్యదియె మదీయజీవితము
నందు గ్రహించిన దివ్య సత్యమౌ ;—
బ్రతుకుసుడిన్ మహోన్నత త
రంగము లొక్కట క్షోభ పెట్టఁగా
సదమలమై కలం బొకటి
చక్కఁగ నద్దరిఁ జేర్చు జీవునిన్ ;—

చ. "వివిధములైన యర్చనలు
విశ్రుతయోగసుసాధనంబులున్
సవివరతత్త్వముల్ ప్రకృతి
శాస్త్రము దర్శనహేతువాదముల్
అవిరళదానధర్మములు
నన్నియుఁ జూడ మనోభ్రమంబులే ;—
ప్రవిమలప్రేమ యొక్కటె ప్ర
భావవిభాసిత మెల్లభంగులన్.

చ. "మొదలును మధ్య మంత మను
మూఁడు నెఱుంగని నీకుఁ బుట్టి నీ
హృదయములోపలన్ వెలయుఁ
బ్రేమసముద్ర మఖండమై సదా
ముదమున నిమ్ము సర్వమును
మోదముతోడుత నిచ్చివేయుమీ ;—
యెదురడుగన్ క్షయంబగు సు
మీ! కణమై ప్రణయాబ్ధి వెంటనే.

చ. "శమదమసంపదాన్విత ద్వి
జప్రభుఁ డాది పిపీలికాంత స
ర్వమునను వేయునేలఁ దలఁ
పన్ బరమాణువునందుఁగూడ స
త్యము ప్రణయార్ణవంబు—పర
మాత్మనిరూపె—వెలుంగుఁ గాన నీ

సుమహితరూపులందె మన
సున్ దను వాత్మయు నర్చసేయుమీ!

చ. "పరమదయాత్మకుని
బాహిరరూపము లిట్లు కన్పడన్
బెరతలమందు రోయుదువె
విశ్వమయాత్ము? నభేదబుద్ధి నే
నరుఁడు సమస్తమున్ ద్రికర
ణంబులఁ బ్రేమకుఁ దావుచేయు నా
నరుఁడె మహేశ్వరున్ ద్రికర
ణంబులఁగొల్చినవాఁడు చూడఁగన్." *

మాటలు కఠినములై యుండుఁగాక, ప్రేమ యేభాష నేరూపమును దాల్చినను సహజముగనే జనులు గ్రహింతురు.

ప్రేమ, నిష్కాపట్యము, సహనము—ఇవియే మనకు వలయునవి. జీవనమనఁగా నేమి? వికాసము, ప్రేమ. కావున సమస్తమైన ప్రేమయు జీవనమే; ప్రేమయే జీవననియమము, స్వార్థపరతయే మరణము. ఇహముననైనను బరముననైనను నిదియే యథార్థము. సత్కార్యాచరణమే, పరహితాచరణమే, జీవనము—తదభావమే మరణము. మానవమాత్రులలోఁ—బశుప్రాయులలో—నూటికిఁ దొంబదిమంది జీవచ్ఛవములు, పిశాచములు—ఏలందురా, నాయనలారా!

* ఈ పద్యములు శ్రీ బులుసు వేంకటేశ్వర్లు (బి. ఏ.) గారిచే మాకోరికపై మూలమునుండి యనువదింపఁబడినవి.—అను.

ప్రేమవిరహితులు జీవన్మృతులు. సానుభూతి కలిగి వర్తింపుఁడు: వత్సలారా! దీనులను, పేదలను, అజ్ఞులను, అధఃకృతులనుగూర్చి పరితపింపుఁడు—హృదయము స్తంభించు పర్యంతము, తల దిమ్ముపట్టునంతవఱకు, చిత్తవిభ్రాంతి గలుగునాయని తోఁచునంతదనుక పరితపింపుఁడు. అపు డీశ్వరచరణోపాంతమున నాత్మసమర్పణము గావించుకొనుఁడు. శక్తిసామర్థ్యములును దోడ్పాటును నప్రతిహతబలమును నపుడు మీకు లభించును.

పరికింపుఁడు, ధనమువలన నేమి ప్రయోజనము? పేరుప్రతిష్ఠలవలన నేమి ప్రయోజనము? పాండిత్యమువలన నేమి ప్రయోజనము? ప్రేమయే ఫలప్రదము; దుర్భేద్యకష్టపరంపరలనెడి పర్వతములను విదళించి రాజమార్గ మేర్పఱచునది వజ్రాయుధతుల్యమగు శీలము.

ప్రేమయు సానుభూతియునే యెన్నఁటికైనను మనకుఁ దరణోపాయము. ప్రేమయే యారాధన.

ఒకరికిని మఱియొకరికిని, ఆర్యునకును మ్లేచ్ఛునకును, బ్రాహ్మణునకును చండాలునకును, పురుషునకు స్త్రీకిని బురుషునకును నడుమ నెట్టిభేదమును ప్రేమ పాటింపదు. ప్రేమ సమస్తవిశ్వమును స్వీయనిలయముగా నొనరించును.

ప్రేమయే విజయసింహాసన మధిష్ఠించునది. మీ సోదరమానవులను మీరు ప్రేమింతురా? దేవు నెచట వెదకుట?—ఈ పేదలును, ఈ దుఃఖితులును, ఈ దుర్బలులును దైవస్వరూపులు కారా? ముందుఁగా వారల నేల యర్చింప

రాదు? గంగానదీకూలమున నూతులు త్రవ్వనేల? పేరు ప్రతిష్ఠలనెడి గాజుఊగాకైవరికిఁ గావలయును? మీకుఁ బ్రేమ కలదా?—ఉన్నచోఁ, మీరఖండశక్తిమంతులు. మీరు స్వార్థరహితులేనా? ఐనచోఁ, హరిబ్రహ్మాదులైనను మిమ్మడ్డు కొనఁజాలరు.

వికాసమే జీవనము, సంకోచమే మరణము. సమస్త ప్రేమయు వికాసమే, సమస్తస్వార్థపరతయు సంకోచమే. కావునఁ బ్రేమయే జీవన నియమము. ప్రేమ గలవాఁడే సజీవుఁడు. స్వార్థపరుఁడు మృతప్రాయుఁడు. కావున నవ్యాజముగాఁ బ్రేమింపుము. అవ్యాజప్రేమయే జీవననియమము.

పుస్తకములు, పాండిత్యము, యోగము, ధ్యానము—నివన్నియుఁ బ్రేమతోఁ బోల్చిచూచినచోఁ దృణప్రాయమనిపించును, ధూళి యనిపించును. ప్రేమయే నీకు దివ్యశక్తులను జేకూర్చును. ప్రేమయే భక్తి నొసఁగును, జ్ఞానము నొసఁగును; ప్రేమయే ముక్తి నొనఁగూర్చును.

ప్రేమ సత్యము, ద్వేష మసత్యము; ఏలన ద్వేష మనేకత్వమునకు—భిన్నత్వమునకు—దారితీయును. మానవులనడుమ భేదబుద్ధిని గల్పించునది ద్వేషమే, కావున నది దోషము, మిథ్య. అది విచ్ఛేదనశక్తి, భేదములను గల్పించి వినాశము గల్గించును.

ప్రేమ బంధుత్వము నొనఁగూర్చును, ఏకత్వమును సమకూర్చును. బిడ్డతోఁ దల్లియు, గ్రామముతోఁ గుటుంబములును, లోకమంతయు జీవజంతువులతోడను బ్రేమమూల

మున నైక్యమును గాంచుచున్నవి. ప్రేమయే యస్తిత్వము, సాక్షాద్బ్రహ్మము, మనకు గోచరించున దాతయు నాయద్వితీయప్రేమస్వరూపమే ; అది యొకప్పు డధికముగను మఱి యొకప్పు డల్పముగను వ్యక్తమగుచుండును. తారతమ్యస్థితి యందుమాత్రమే భేదము, కాని యేకైకప్రేమతత్త్వమే నానాప్రకారములుగను భాసించుచున్నది. కావున మన కేర్పడుచున్నది నానాత్వమా, యేకత్వమా? యని సర్వకార్యములందును మనము వివేచింపవలసియున్నది. నానాత్వమును, లేక భిన్నత్వమును గల్పించు విషయములను మనము విడనాడవలయును, ఏకత్వమును గూర్చువానిని యోగ్యములని స్వీకరింపవలయును. ఇట్లే మన తలఁపుల యెడలను వర్తింపవలయును; వానివలన విచ్ఛిన్నతయు భిన్నత్వమును సిద్ధించుచున్నవా, లేక జీవుల కన్యోన్యబాంధవ్యమును గల్గించుచు, జీవనరంగమునందంతటనను నొకే ప్రభావమును జూపుచుండు నైక్యము సిద్ధించుచున్నదా యని పర్యాలోచింపవలయును. ఐక్యమూలములగు వానిని మనము గైకొనవలయును, తద్భిన్నమగువానిని దోషాకరములని విడనాడవలయును.

సర్వ మాత్మయే, సర్వము నేనే. ఇట్లు భావించు జీవుఁడు నిర్మలుఁడై యొప్పును. దాని కే ప్రేమయన నేమో యర్థమగును. భయమువలనఁ ప్రేమకలుగఁజాలదు; ప్రేమ నిలయము స్వాతంత్ర్యము, స్వేచ్ఛ, లోకమును నిజముగాఁ ప్రేమింపనారంభించునప్పుడే విశ్వమానవ సాభ్రాత్రమనఁగా

నేమో, మానవకోటి యనఁగా నేమో, మనకు బోధపడఁగలదు.

బుద్ధుని మహోపదేశవాక్యములను స్మరింపుఁడు : ఆ యుపదేశ సందర్భమున నాతఁ డెట్లు తన ప్రేమమయసంకల్పమును ప్రాక్పశ్చిమదిశలందును, ఉత్తరదక్షిణములందును, ఊర్ధ్వదిశయందును, అధోదిశయందును, అఖండము, అనంతము, దివ్యమునై వెలయు తన ప్రేమ సర్వజగద్వ్యాప్తమగుపర్యంతము నెట్లు ప్రసరింపఁజేసెనో స్మరింపుఁడు. అట్టి భావము మీకుఁ జేకూఁరినంతనే నిజమైన వ్యక్తిత్వ మమరుచున్నది.

సమానాంతర రేఖలవలె సరిసమానముగా రెండు శక్తులు జీవనరంగమున నొకదానిసరస నొకటి ప్రవర్తించుచున్నవి. ఒకటి 'అహం' (నేను) అనుచుండును, రెండవది 'నాహమ్' (నేనుగాదు) అనుచుండును. ఇవి మానవునందే కాక, మృగములందును, మృగములందన నేల,యత్యల్పక్రిమికీటకములందునుగూడ గోచరించుచున్నవి. నరుని బట్టి గోళ్లతోఁ జీల్చివేసి వేఁడినెత్తురు త్రావు పులి తన పిల్లలను రక్షించుకొనుటకై ప్రాణము నర్పించుచున్నది. జంకును గొంకును లేక సోదరమానవులను జంపు పరమదుర్మార్గుఁడు పస్తుండియున్న తన యాలుబిడ్డలను గాపాడుకొనుయత్నమున నిస్సంకోచముగాఁ బ్రాణము నర్పింపవచ్చును. ఇట్లు సృష్టియం దంతటను నీ రెండుశక్తులును సరిసమానముగా సాగుచున్నవి, ఒకటియున్నచోట రెండవదియు గోచరించును.

ఒకటి స్వార్థపరత్వము, రెండవది స్వార్థరాహిత్యము. ఒకటి పరిగ్రహణము, రెండవది పరిత్యాగము. పిపీలికాదిబ్రహ్మ పర్యంతము లోకమంతయు నీ రెండుశక్తులకును క్రీడా రంగము. దీనిని నిరూపింపనక్కఱలేదు. ఇది యెల్లరకును దేటతెల్లమే.

జగత్క్రియయంతయు, జగత్పరిణామమంతయు, నీ రెండు మూలకారణములలో నొకదానిమీఁదనే, అనఁగా స్పర్థమీఁదనే, పోరాటముమీఁదనే, యాధారపడియున్న దనుటకు సమాజమున నేపక్షమునకుఁగాని చెల్లదు. ప్రపంచ మంతయుఁ గ్రోధవైరములపై, స్పర్థాకలహములపై నాధార పడి నడచుచున్నదనుట కెవ్వారికిని దగదు. ఇవి లేవని మనము చెప్పుట లేదు, కాని రెండవశక్తియుఁ బనిచేయుచున్నదనిన, లేదనుట కెవ్వరికి నధికారము లేదు. ఈ "నాహం", ఈ త్యాగము, ఈ ప్రేమ,—ఇదియే జగత్తునఁ బ్రత్యక్షశక్తి యనిన, కాదని యెవరు నిరాకరింపఁగలరు? రెండవదగు వైరము కేవల మీప్రేమ నపార్థముచేసికొని దుర్వినియోగ మొనర్చుటయేకాని మఱియొకటికాదు. ప్రేమశక్తియే స్పర్థను, వైరమును వెలువరించుచున్నది; వైరమునకు నిజమైన మూలకారణము ప్రేమయే. కీడుచేయువాఁడు మంచివాఁడే, వాని పరమోద్దేశమును మంచిదే. అది కేవలము శ్రేయశ్శక్తిని బెడదారిని బెట్టుటయేకాని మఱియొకటికాదు. ఒకఁడు మఱియొకని వధించుచో, బహుశః తన బిడ్డయందలి ప్రేమావేశముచే నట్లు చేసియుండవచ్చును. వాని ప్రేమ

లోకమునఁ గల కోట్లకొలఁది యితరమానవులను గాదని, తన బిడ్డయనెడి కోణమున బంధింపఁబడియున్నది, పరిమితమై యున్నది. ఐనను నది ప్రేమయే.

ఎనిమిదవ ప్రకరణము

## ఆచారసంప్రదాయములందలి గుణదోషములు

వ్యక్తిని శాశ్వతముగా సమాజమున కధీనమొనర్చుట వలనను శిక్షాసంప్రదాయములచే నేర్పడు నిర్బంధయుత స్వార్థత్యాగమువలనను గలుగు ఫలితమునకు మన మాతృభూమి దివ్యనిదర్శనము. ఈ దేశమున శాస్త్రవిధుల ననుసరించియే జనులు సంతానమును గనుచుందురు. యావజ్జీవము శాస్త్రవిధినిషేధముల ననుసరించియే వారిభోజనపానీయములు; వివాహాదిసంస్కారములును నట్టివే; తుదకు మరణమును శాస్త్రవిధి ననుసరించియే. ఇందుఁగల యొకగొప్ప సుగుణమునువిడిచినచో, ఈకఠినశిక్షణమంతయు దోషభూయిష్ఠమని చెప్పవలసివచ్చును. సుగుణమేమనఁ, దరతరముల నుండియుఁ బ్రతిదినము నభ్యస్తమైయుండుటచే నల్పయత్నముతోడనేచాలచక్కఁగా నేయొకటిరెండుపనులో జనులు చేయఁ గలుగుచుందురు. మూడు మట్టిగడ్డలయొక్కయుఁ గొన్ని పుడకలయొక్కయు సాయమున నీదేశమునందలి వంటవాఁడు గాని, వంటకత్తెగాని సిద్ధముచేయఁగలుగు రుచ్యమగు నన్నమును గూరయు భూతలమున మఱియెచ్చటను లభింపవు ఇక్ష్వాకులనాఁటి సాధనసామగ్రియగు నొక్కరూపాయి విలువ

గల మగ్గముతో, చిన్నగోతిలో నుంచఁబడిన కాళ్లతో, గజ మిఱువదిరూపాయిలు ఖరీదుచేయు సన్నని జరీబట్టలను నేయుట యీ దేశమునమాత్రమే సాధ్యము. చినిఁగిపోయిన యొక చాఁప, ప్రమిదలోఁ బెట్టఁబడిన యొక యాముదపు దీపము—నిటువంటి సాధనసంపదచేఁ బండితప్రకాండు లుత్పన్నమగుచుండుట యీ దేశముననే. అంగవైకల్యపుటం దవికారపుఁ బెండ్లామునెడ నఖండక్షమాశీలమగు ననురాగ మును, అభాగ్యపుటవకతవకవ్యక్తియగు మగనియెడ నా జన్మాంతమగు పతిభక్తియు సాధ్యమగుచుండుట యీ దేశ ముననే. ఇంతవఱకే సులక్షణములు.

కాని యివి యన్నియుఁ గేవలనిర్జీవయంత్రమువలె నడచు జనులచే నొనర్పఁబడుచున్నవి;—మనోవ్యాపార దక్షత లేదు, హృదయవికాసము లేదు, జీవచైతన్యము లేదు, ఆశాప్రసారము లేదు; ఇచ్ఛాప్రకోపము లేదు, ఆనందోత్కర్ష లేదు, తీవ్రదుఃఖానుభూతియు లేదు; నిర్మాణప్రతిభాసంచల నము లేదు, నూతనతత్త్వజిజ్ఞాస లేదు, నూతనవిషయ గుణ గ్రహణమే లేదు. ఇట్టిమానసమునుండి మబ్బులెన్నఁడును దొలఁగవు. ఉదయభానుసందీప్తచిత్ర మీ హృదయమును రంజింపఁజేయఁ జాలదు. ఇంతకంటెనున్నతస్థితి కలదా, లేదా యను విషయమే యీ మనస్సునకుఁ దట్టదు; తట్టెనో, నమ్మ కము కలుగదు; కలిగెనో, ప్రయత్నము కొఱవడును; ఒకవేళఁ బ్రయత్నమును నడ్డెనో, ఉత్సాహలోపము దానిని నాశనముచేయును.

నియమానుసారము మనుటవలనమాత్రమే యౌన్నత్యము గలుగుచో, వంశానుగతాచార సంప్రదాయములను 'తు, చ' తప్పకుండఁ బరిపాలించు టొక్కటే సుగుణమగుచో, నొకచెట్టుకంటె విశేషసుగుణసంపన్నుఁ డెవ్వఁడో, ఒకరైలుబండికంటె విశేషభక్తుఁడును విశేష మహనీయుఁడును నెవ్వఁడో, చెప్పుఁడు. ఆయి ప్రకృతినియమము నుల్లంఘించు టెవ్వరైనను, ఎన్నఁడైనను జూచిరా? పశువులు పాపముచేయు టెవ్వరైనను నెఱుఁగుదురా?

వెఱ్ఱినమ్మకములను మూఢవిశ్వాసములను బోధించి జనులచే సత్కార్యములను జేయింపనేల? జనులను స్వతంత్రులను జేయుఁడు, వారిసంకెలలను విదళింపుఁడు—అనియే నేను ఘోషింతును. బురదచే బురదను గడుగఁగలమా? దాస్యముచే దాస్యమును బాఱఁద్రోలఁ గలమా? ఏది?—ఒక్కనిదర్శనము జూపుఁడు. సమాజమునిమిత్తము సర్వసుఖేచ్ఛలను ద్యజింపఁగలిగిననాఁడు నీవు బుద్ధుఁడవై ప్రకాశింతువు, ముక్తుఁడవై వెల్గొందుదువు.

## తొమ్మిదవ ప్రకరణము

## విద్య

విద్య యనఁగా నేమి? పుస్తక పాండిత్యమా? కాదు. వివిధశాస్త్రజ్ఞానమా? అదియుఁ గాదు. ఇచ్ఛావాహినియుఁ దద్వ్యక్తీకరణమును నేశికువలన స్వాధీనమై, ఫలప్రద మగునో యదియే విద్య; అదియే విద్యాభ్యాసము. దేనివలనఁ

దరతరములనుండియు నిరంతరబలాత్కారముచే నిచ్ఛాశక్తి స్తబ్ధమై, నేఁ డించుమించుఁగా వినాశము పాలైనదో, దేనిప్రభావమున నూతనభావములమాట యటుండఁ,బూర్వ భావములును నొకటొకటిగా నంతర్ధానమగుచున్నవో, అదియా విద్యాభ్యాసము? ఎయ్యది మానవుని మెల్లఁగా యంత్రముగా మార్చివేయుచున్నదో యదియా విద్యాభ్యాసము?—ఆలోచింపుఁడు. యంత్రప్రాయముగా సజ్జనుల మైయుండుటకంటె స్వతంత్రేచ్ఛాజ్ఞానప్రేరితులమై తప్పు చేయుటయైనను దివ్యమని నా యభిప్రాయము.

విద్యయనఁగా మీ తలలోని కెక్కింపఁబడిన విషయ బాహుళ్యముకాదు, జీర్ణముకాక కలఁతఁ బుట్టించు నానా విషయముల కలగూరగంప కాదు. ఉజ్జీవనకరము, ధైర్య వీర్యజనకము, శీలనిర్మాణసమర్థము నగు భావములను గ్రహించుటయే (విద్య; అదియే) మనకు వలయునది. ఐదు భావములను గ్రహించి వానిని మీ జీవితముగా, శీలముగా నొనర్చుకొనఁగలిగితిరా, పెద్ద భాండాగారము నంతను గంతస్థముచేసికొనినవానికంటె విశేషవిద్యావంతులనఁదగు వారై దీపింతురు. విద్య కేవల భావరాశియైనచోఁ, బుస్తక భాండాగారములే మునిపుంగవులనియు, విజ్ఞానసర్వస్వములే ఋషీశ్వరులనియుఁ జెప్పవలయును.

అన్యభాషలో నన్యుల భావములను 'బట్టీపట్టి', వానిని మెదటినిండ దట్టించుకొని యేవిశ్వవిద్యాలయ బిరుదములనో సంపాదించినంతనే విద్యావంతుల మనుకొనుచున్నారు

కాఁబోలును! ఇదియా విద్య? మీ విద్యాగమ్యమేమి? 'గుమస్తాగిరి'యో, 'లాయరుపదవి'యో, ఉత్తమపక్షము, 'డెప్యూటి మేజిస్ట్రేట్ పదవి'యో—ఇంతేకదా? దానివలన మీకుఁగాని, దేశమునకుఁగాని యేమి పురుషార్థము? అన్నదానమునకుఁ బేరుపొందిన భారతవర్షమున, "అన్నమో రామచంద్రా!" యని పలవించు నార్తనాదము లెట్లు వినవచ్చుచున్నవో, ఆకసము నెట్లు చిల్లులు వడఁజేయుచున్నవో కనుఁడు. మీ విద్య యీ యార్తిని బాఁపఁ జాలునా? జీవనసంరంభమునకు జనసామాన్యమును సమర్థముచేయఁజాలని విద్య,— శీలబలమును, లోకహితకాంక్షను, సింహసాహసమును వెలువరింపఁజాలని విద్య—విద్యయనఁదగునా?

దేనివలన శీల మేర్పడునో, మనోబల మభివృద్ధి చెందునో, బుద్ధి వికసించునో, స్వశక్తిపై నిలుచుటకు మానవు నెయ్యది సమర్థుని జేయునో—అట్టి విద్యయే మనకు వలయునది. విదేశీయ నిరోధమనునది లేకుండ, మన విజ్ఞానమందలి వివిధశాఖలను— వివిధశాస్త్రములను— వానితోఁబాటాంగ్లభాషను బాశ్చాత్యభౌతికశాస్త్రమునుసైతము నేర్వవలయును; మన పరిశ్రమలను వృత్తివిద్యలను బెంపొందించు పారిశ్రామికవిద్యలనన్నిటిని మనము నేర్వవలయును; తన్మూలమున నుద్యోగములకై — సేవకావృత్తికై —ప్రాఁకులాడుటకుబదు లాత్మరక్షణార్థము వలయున దంతయు నార్జించుకొనుటయే కాక, యీతిబాధలు వచ్చినను భయపడనక్కఱ లేకుందుము.

మనలను ధీరుల నొనర్చుటయే సమస్తవిద్యాభ్యాసమునకును, సమస్తశిక్షణమునకును బరమప్రయోజనమై యుండవలయును. మనలను వికాసము నొందించుటయే సమస్త శిక్షణమునకును బరమావధి. దేనివలన నిచ్ఛా వాహినియుఁ దత్ప్రకటనమును స్వాధీనమై ఫలప్రదమై యొప్పునో యదియే విద్య. జగద్రహస్యములలోనికిఁ జొచ్చి కార్యసిద్ధిని గనఁజాలునట్టి బ్రహ్మాండమైన సంకల్పశక్తి, సాగరగర్భమునకుఁ బోవలసివచ్చినను, స్వయముగా మృత్యుదేవత నెదుర్కొనవలసివచ్చినను, జలింపని యప్రతిహత సంకల్పబలము, ఇనుపకండలు, ఉక్కునరములు—ఇవియే మన దేశమున కిపుడు వలయునవి. మనలను ధీరుల నొనర్పఁగల మతము, ధీరులనొనర్పఁగల సిద్ధాంతములు, సర్వతో ముఖముగా ధీరుల నొనర్పఁగలవిద్య—ఇవియే మనకు వలయునవి.

ఐరోపాఖండమున వివిధపట్టణములలోఁ బయనించు నపుడు, అచటి పేదలకుసైతము గల సదుపాయములును సౌఖ్యమును విద్యయు మన దేశీయుల దైన్యావస్థను దలఁపునకుఁ దెచ్చుటచేఁ గన్నీళ్లు గార్చువాఁడను. ఈ వ్యత్యాసమునకుఁ గారణమేమి ? విద్యయేయని నేను బొందిన సమాధానము. విద్యవలన, ఆత్మవిశ్వాసమువలన (మఱి దేని వలనను గాదు), అంతర్గతబ్రహ్మము వారియందు మేల్కొనుచున్నది; మనయందలి బ్రహ్మమో, నిద్రపోవుచున్నది. మఱి మాన్యములనునవి లేక, చేతఁ గాసైన లేక, యధఃకృతులై,

వెట్టివాలకముతో, బుద్ధిమాంద్యముతో,— నొకకఱ్ఱయు దానిచివరఁ గట్టఁబడిన చింపిగుడ్డలమూటయు—నీమాత్రపు టాస్తితో, బేలచూపులతో— నైర్లాండ్ దేశమునుండి వలస వచ్చువారిని న్యూయార్కులో నేను గమనించు వాఁడను. ఆఱునెలలలో వేఱుదృశ్యము—ఆ వ్యక్తియే ఠీవితో నడచుచుండును, దుస్తులు మాఱును. కన్నులలోఁ గాని, యడుగులలోఁగాని దైన్యమేమియుఁ గానరాదు. కారణము? స్వదేశమున నందఱిచేతను నాతఁ డేవగించు కొనఁబడుచుండెనని—యేకగ్రీవముగా సమస్తప్రకృతియు వానితో, "నోరి పుల్లయ్యా! నీకింతకంటె గతి లేదు, బానిసవై పుట్టినావు, బానిసవై నీవుండవలయు"నని చెప్పు చుండెనని మన వేదాంతము తెలుపును. పుట్టుకనుండియు నట్లు చెప్పఁబడుటచేఁ బుల్లయ్య దానిని నమ్మి తా నత్యల్పుఁ డనని భ్రమించినాఁడు, వానియందలి బ్రహ్మము నిహితమై పోయినది. కాని యమెరికాలోఁ గాలిడినంతనే—"పుల్ల య్యా, నీవును మావలెనే మానవుఁడవు, మానవుఁడే సర్వము సాధించియున్నాఁడు; నిన్ను, నన్నుఁ బోలు మానవుఁడు కూడ సర్వముసాధింపఁగలఁడు; ధైర్యము నవలంబింపుము!" అని నానాదిక్కులును ఘోషించినవి. పుల్లయ్య తల యెత్తెను, అది నిజమేయని గ్రహించెను, అంతర్గతమగు బ్రహ్మము మేల్కొనెను, "ఉత్తిష్ఠత జాగ్రత ప్రాప్యవరాన్ని బోధత*—లెమ్ము, మేల్కొనుము, గమ్యప్రాప్తిపర్యంత

---

* కఠోపనిషత్తు, 1. 3. 4.

మాఁగవలదు'' అని ప్రకృతియే వానికిఁ జాటెనని చెప్ప
నగును.

స్వదేశమున నైర్లాండ్ దేశీయుని స్థితివలెనే మహ
బాలుర విద్యాభ్యాసమంతయుఁ బెడదారినిఁ బట్టుచున్నది.
అం దేగుణమును లేదనుటకాదు, కాని యందలి లాభములు
కంటె నష్టములే మెండు. అది మనలను ధీరులను జేయు
విద్యగాదనునది మనము గమనింపవలసిన మొదటివిషయము.
కేవల వ్యతిరేకవిద్య యది. వ్యతిరేకవిద్యకంటె, ఆత్మనిరసన
ముపై నాధారపడియుండు శిక్షణముకంటె, మరణము మేలు.

మన మెందులకును గొఱగానివారమని, వట్టియనామ
తరువులమని, నేర్చుకొనియున్నాము. మనదేశమున మహా
నీయు లుద్భవించియుండిరని మనచదువు మన కెన్నఁడును
బోధించిన పాపమునఁ బోలేదు. సార్థకమగు విషయములు
మన కెన్నఁడును బోధింపఁబడలేదు. మన కాలుసేతుల
నెట్లుపయోగించుకొనవలయునో కూడ మనము నేర్వము.
ఫలితమేమి? అర్ధశతాబ్దమునుండి సాగుచున్న యిట్టి విద్యా
విధాన ముపజ్ఞావంతుఁడని చెప్పఁదగు నొక్కవ్యక్తినైనను
వెలువరించియుండలేదు. ఉపజ్ఞావంతుఁడగు ప్రతివాఁడును
నీదేశములోఁగాక మఱియేయితర దేశముననో విద్యాభ్యా
సము నొందియున్నాఁడు; లేదా, మాలిన్యవిమోచన
మునకై యట్టివారు మరలఁ బ్రాచీన విశ్వవిద్యాలయ
ములకు—గురుకులవాసముల—కరిగియున్నారు.

ప్రతివ్యక్తియందును బరిపూర్ణత స్వతస్సిద్ధముగ నే

కలదు, తత్ప్రకటనమే విద్య. జ్ఞానము మానవునకు స్వత స్సిద్ధము; బాహ్యమునుండి జ్ఞానము కలుగుట లేదు. మానవుఁడు 'తెలిసికొనియున్నాఁ' డనుచున్నాఁడు, వస్తుతః చెప్పవలెనన్న, 'కనిపట్టియున్నాఁడు' లేక 'నిరాచ్ఛాదితమొనర్చియున్నాఁ'డని చెప్పవలసియుండును. ఇట్లే మానవుఁడు 'నేర్చుకొనుచున్నాఁ'డనునది నిజముగా నాతఁ డఖండజ్ఞాననిలయముగు తనయాత్మను గప్పియున్న యజ్ఞానావరణమును (తాత్కాలికముగాఁ) దొలఁగించుకొని 'కనిపట్టుచున్న' సంగతియే కాని మఱియొకటి కాదు. న్యూటను ననునాతఁడు గురుత్వాకర్షణశక్తిని (Gravitation) కనిపట్టినాఁడని చెప్పుచుందుము. అది యాతనికొఱకు నిరీక్షించుకొని యొకమూలఁ గూర్చుండెననియా తాత్పర్యము? అది యాతని మానసముననే యుండెను; సమయము వచ్చినంతనే దాని నాతఁడు కనుఁగొనినాఁడు. లోక మింతవఱకు గ్రహించిన జ్ఞానమంతయు మానసమునుండియే కలుగుచున్నది; అనంతవిశ్వభాండాగారము నీమానసముననే యున్నది. నిన్ను నీమానసమును బరిశీలింపఁజేయుటకు బాహ్యప్రపంచము కేవలము సూచనను—సమయమును—గల్పించుచున్నది. కాని పరిశీలనవిషయముమాత్ర మెప్పుడును నీమానసమే. రేఁగుచెట్టునుండి పండు క్రిందఁబడుట న్యూటనునకు (అందేదియో ప్రకృతినియమముండునను) సూచనకాఁ నాతఁడు తన మానసమును బరిశీలించుకొని తన పూర్వానుభవముల నన్నిటిని బునఃపరిష్కరించుకొనినంతనే యాతనికి వానిలో నూతన

మగు సమన్వయసూత్రము పొడకట్టెను; దాని కాతఁడు గురుత్వాకర్షణనియమము (Law of gravitation) అని పేరిడెను. ఈనియమము రేఁగుపండులోఁగాని, భూగర్భమున మఱిదేనియందుఁగాని లేదు.

కావున వ్యావహారికము గానిండు, పారమార్థికము గానిండు, జ్ఞానమంతయు—విద్యయంతయు—మానవమానసముననే కలదు. పెక్కెడల నియ్యది యావృతమై కనఁగానఁబడకుండును; ఈయావరణము క్రమముగాఁ దొలఁగింపఁబడునప్పుడు మనము 'గ్రహించుచున్నా'మని చెప్పుదుము; మఱియు దీనిని దొలఁగించిన కొలఁదియు జ్ఞానాభివృద్ధి కలుగుచుండును. ఎవ్వనియందుండి యీ యావరణము తొలఁగుచుండునో యాతఁడే జ్ఞానాభివృద్ధిగాంచుచుండు మానవుఁడు; ఎవ్వనియం దిది సాంద్రమైయుండునో యాతఁడే యజ్ఞాని; ఎవ్వనియందుండి పూర్తిగాఁ దొలఁగెనో యాతఁడే సర్వజ్ఞుఁడు. మానసమున జ్ఞానము చెకుముకిఱాతియందలి యగ్నికణమువలె నున్నది; దానిని వెలువడఁ జేయు సంఘటనమే వలయు నొఱపిడియని చెప్పవచ్చును. సమస్తజ్ఞానమును సమస్తశక్తియు నంతరంగముననే కలవు. శక్తులఁయుఁ బ్రకృతిరహస్యములనియుఁ జెప్పఁబడెడి వన్నియు నంతరంగమునఁ గలవు. సమస్తజ్ఞానమును జీవాత్మయందుండి వెలువడుచున్నది. మానవుఁడు జ్ఞానమును బ్రకటించుచున్నాఁడు, స్వతస్సిద్ధముగా, శాశ్వతముగా, నున్న జ్ఞానమును దనయందుఁ గనుఁగొనుచున్నాఁడు.

ఎవ్వరును నెన్నఁడును నిజముగా నన్యులవలన నేదియు నేర్చియుండలేదు. ప్రతివ్యక్తియుఁ దనకుఁ దానే నేర్చుకొనవలసియున్నది. విషయమును గ్రహింప నుద్యమించుటకై బాహ్యగురు వంతర్గురుని మేల్కొల్పు సూచనమాత్ర మొనర్చుచున్నాఁడు. మనభావనావలోకనశక్తుల వలన విషయములు మనకు విస్పష్టముగా నాత్మయందు వానిని దర్శించుచున్నాము. ఎకరములపర్యంతము భూమి నాక్రమించియుండు మహావటవృక్షమంతయుఁ బ్రాయికముగా నావగింజలో నెనిమిదవవంతుకంటెఁ బెద్దదికాని చిన్నమఱ్ఱిగింజలో నిమిడియుండెను; ఆ శక్తిసంఘాత మంతయును దిమిడియుండెను. బ్రహ్మాండమైన ధీశక్తి జీవకణమున నణఁగిమణఁగియుండునని మనకుఁ దెలియును. ఇది విపరీతముగా మనకుఁ దోఁపవచ్చును, గాని యథార్థము. ప్రతివ్యక్తియు నొక జీవాణువునుండి వెలువడియున్నది, మన శక్తులన్నియు నందణఁగిమణఁగి యున్నవి. అవి యాహారమునుండి వచ్చినవని మీరు చెప్పఁజాలరు. ఏలన నాహారమును దెచ్చి కొండంతయెత్తు గుట్టలు వేసినను, నందుండి వెలువడు శక్తి యేముండును? గర్భితముగనే కావచ్చును, కాని జీవాణువునందఖండశక్తి కలదు. అటులనే నరునకుఁ దెలిసినను, దెలియకున్నను, వానియాత్మ యఖండశక్తిమంతము. తత్ప్రకాశము కేవలము దానిని గుర్తించుటతోఁ గూడుకొనియున్నది.

ఆత్మజ్యోతి యనేకులలో మఱుఁగుపడియుండును.

ఇయ్యది యినుపపీపాలో నుంచిన దీపమును బోలును, అం దుండి కాంతి లేశమును వెలువడఁజాలదు. పర్యవసానమున గాజువలె స్వచ్ఛమై ప్రకాశించుపర్యంతము నైర్మల్యస్వార్థ రాహిత్యములచేఁ గ్రమముగా నీయావరణసాంద్రతను క్షీణింపఁజేసికొననగును. ఎందుండి యంతర్జ్యోతి యథాస్థితి యందుఁ గాంచనగునో యట్టి కాచసంపుటముగా మాఱిన యినుప సంపుటమువంటివాఁడు శ్రీరామకృష్ణుఁడు.

మొక్కను మన మెదుగఁజేయఁజాలని చందముననే బిడ్డకును మనము బోధింపఁజాలము. మొక్క తన స్వభావ మును దానే పెంపొందించుకొనుచున్నది. అట్లే బిడ్డయుఁ దనకుఁదానే బోధించుకొనుచున్నది. స్వీయమార్గమున వికా సము నొందుటకు మనము దానికిఁ దోడ్పడఁగలము, అంతి యే. ఆటంకములను దొలఁగించుటయే కాని, లేనిదానిని మనము తీసికొనిరాఁజాలము. ఆటంకములను దొలఁగించి నంతనే జ్ఞానము స్వతస్సిద్ధముగా వ్యక్తమగుచున్నది. మొక్క సులభముగా వెలువడఁ గలుగునట్లు మట్టిని గొంచెము గుల్ల బాఱఁజేయుఁడు. ఏజంతువును నములివేయకుండునట్లు మొక్క చుట్టును గంచెవేయుఁడు. దానికి వలయు మట్టిని నీటిని గాలిని సమకూర్చి గింజ తన శరీరమును నిర్మించుకొనుటకు వలయు పదార్థములను జేకూర్పుఁడు, మీకర్తవ్యమంతియే. మొక్క తనకు వలయుదానినంతయు స్వాభావికముగనే గ్రహించును. నీరు మొదలగువానిని జీర్ణించుకొని సహజ ముగనే వికాసము చెందును. బిడ్డవిద్యావిషయము నిట్టిదే,

బిడ్డ తానే విద్య నేర్చుకొనుచున్నది. తాను బోధించుచున్నానని భావించినచో, నుపాధ్యాయుఁ డంతయుఁ బాడు చేసినవాఁడగును. మానవుని యంతరంగముననే సమస్త విజ్ఞానమును గలదు, వలయునది ప్రబోధము; అదియే యుపాధ్యాయుని పని. కాలుసేతులను, గన్నులను, జెవులను సరిగా వినియోగించుకొనునట్లు బుద్ధి నుపయోగింపనేర్చుకొనుటకుఁగాను బాలురకు మనము కేవలము తోడ్పడ వలయును.

ఎవరో చెప్పినమాట విని తాను దనగాడిద గుఱ్ఱముగా మాఱుటకుఁగాను దానినిఁ బడఁగొట్టినవాని పద్ధతిని మన బాలురకు విద్య నేర్పఁబూనునట్టి విధానము విరమింపఁబడ వలయును. తల్లిదండ్రు లనుచితాధిపత్యమును నెఱపుచుండుటచే మన బాలురు వికాసము నొందుటకు సహజావకాశమును బొందఁజాలకున్నారు. సాఫల్యము నొందుటకు సదవకాశము నొందఁదగిన ప్రవృత్తు లనంతముగాఁ బ్రతివ్యక్తి యందును గలవు. ఒరులను సంస్కరింపవలయునని బలాత్కారముగాఁ బ్రయత్నించుచో, సిద్ధించున దెప్పుడును నపజయమే. ఒకనిని మీరు సింహము గానీయకుండినచో, నాతఁడు జిత్తులమారినక్క యగును.

'అగును, కలదు' అనెడి నిర్మాణసమన్వయశీలమగు భావములనే ప్రకటింపవలయును. 'లేదు, కాదు' అనెడి నాస్తిక వ్యతిరేకభావములు జనులను వట్టి దుర్బలులను జేసి వేయును. "నీకుఁ జదువురాదు, నీవు వట్టిశుంఠవు, మూర్ఖుఁ

డవు'' నని యీవిధముగా నిరసించుచు, తల్లిదండ్రులు సదా తమ బిడ్డలను జదువను వ్రాయను వేధించుచుండుటయు, సర్వసాధారణముగా, ఆబిడ్డలట్లే 'తయారగుచుండుటయు' మీకుఁ గాన్పించువిషయమేకదా? దయార్ద్రహృదయులై మంచిమాటలను జెప్పి మీరు వారిని బ్రోత్సహించిన యెడల, సకాలమున వా రభివృద్ధినొందితీరెదరు. నిర్మాణ సమన్వయశీలమగు భావములను మీరు జనులకుఁ దెలుపఁ గలిగినచో, క్రమవికాసమున వారు ధీరులై స్వశక్తిపై నిలువఁగలుగుదురు. భాషావాఙ్మయవిషయములలో నేమి, కళాకవితావిషయములలో నేమి, సర్వవిషయములందును జనులు తమ భావములందును గ్రియలందును బొల్పడు తప్పులను బ్రకటించుటకాక, యాయావిషయములను వారు చక్కఁగా నిర్వహించుమార్గమును దెలుపవలయును. బోధనమనునది బోధితుల యక్కఱల కనుగుణముగా నుండవలయును. పూర్వజన్మసంస్కారముల ననుసరించి మనఃప్రవృత్తు లేర్పడుచున్నవి, కావున శిష్యునిప్రవృత్తిని బట్టి బోధింపుఁడు. ఎల్లరను వారివారి స్థితినుండియే మనము లేవనెత్తవలయును, పురోగమింపఁజేయవలయును. ఎందులకును గొఱగానివారని మే మనుకొనినవారిని సైతము శ్రీరామకృష్ణుఁడెట్లు ప్రోత్సహించి నూతన ధైర్యోత్సాహముల నొనఁగూర్చి వారల జీవనవిధానమునే మార్చివైచెనో మేము కన్నులారఁ గాంచియున్నాము! ఎవ్వని ప్రత్యేకప్రవృత్తిని నాతఁడు చెడఁగొట్టి యెఱుఁగఁడు: అత్యంతపతితులకు

సైతం మా కాశాజనకములును ధైర్యోత్సాహకరములు నగు వచనములనే పలికి వారల నుద్ధరించెను.

స్వాతంత్ర్యములేనిదే వికాస మెన్నంటికిని గలుగం జాలదు. 'ఈ స్త్రీకి స్వాతంత్ర్యమును, ఈ బిడ్డకు మోక్షమును నేను సాధింతు' నని మీలో నెవ్వరైనను జెప్ప సాహసింతురా, అది భ్రమయని, ముమ్మాటికిని భ్రమయని, చెప్పెదను. లేనిపోని జోక్యమును గల్పించుకొనకుండు! వారి సమస్యలను వారే పరిష్కరించుకొందురు. సర్వజ్ఞుల మను కొనుచున్నారు కాంబోలును! భగవంతునికి లేనియధికారము మాకుం గలదని భావింపం బోకుండు! ప్రత్యాత్మయుం బర మాత్మస్వరూపమని మీకుం దెలియదా? ప్రతివ్యక్తిని సాక్షాత్పరమేశ్వరస్వరూపముగాం గనుండు. సేవించుటయే మీరు చేయంగలిగినపని. గర్వింపందగిన సదవకాశముగా గ్రహించి పరమేశ్వరసంతానమును సేవింపుండు. పరమేశ్వరుండు తనబిడ్డలలో నెవ్వనికైనను మీరు తోడ్పడ నను గ్రహించుచో, మీరు ధన్యులు. ఇతరులకు లభింపనియట్టి దివ్యావకాశము మీకు లభించినచో, నిశ్చయముగా మీరు ధన్యులు. దాని నారాధనగా నొనర్పుండు.

జ్ఞానమును బొందుట కొక్కటేమార్గము; అదియే యేకాగ్రత. చిత్తైకాగ్రతయే విద్యాసారము. అత్యల్పుండు మొదలుకొని మహోత్తమయోగివఱకును జ్ఞానోపలబ్ధికి దానినే వినియోగింపవలసియున్నది. పరిశోధనశాలలోం బని చేయు రసాయనశాస్త్రజ్ఞుండు తన మనశ్శక్తులనన్నిటిని

కేంద్రీకరించి ద్రవ్యములపైఁ బఱపినంతనే వాని స్థితిగతులు సుబోధమగుచున్నవి, ఇట్లు వాని శాస్త్రజ్ఞాన మేర్పడుచున్నది. జ్యోతిశ్శాస్త్రజ్ఞుఁడు తన మనశ్శక్తులను కేంద్రీకరించి సూక్ష్మదర్శినిమూలమున గ్రహనక్షత్రములపైఁ బఱపినంతనే యవి గిట్టునఁ దమరహస్యములను వెలిపుచ్చుచున్నవి. కుర్చీలోఁ గూర్చుండి చింతించుచుండు ప్రకృతిశాస్త్ర పండితుని విషయమునఁ గానిండు, పుస్తకహస్తుఁడై యుండు విద్యార్థివిషయమునఁ గానిండు, జిజ్ఞాసువగు ప్రతివాని విషయమునను నీ సూత్రమే వర్తించును.

ఏకాగ్రతాశక్తి వృద్ధిపొందినకొలఁదియు విశేషజ్ఞానము లభించుచుండును. చెప్పులకు రంగువేయు మాదిగవైనను, విశేషచిత్తైకాగ్రతతోఁ బనిచేయుచోఁ, మఱింత చక్కఁగా రంగువేయును. ఏకాగ్రచిత్తుఁడగు వంటబ్రాహ్మణుఁడు మఱింతబాగుగా వంటచేయును. ధనసంపాదనమునఁగానిండు, భగవదారాధనమునఁ గానిండు, మఱియెందైనను గానిండు, ఏకాగ్రత బలీయమైయున్నకొలఁదియు నాకార్యము మఱింత చక్కఁగా నెఱవేఱుచుండును. ప్రకృతిద్వారములను దెఱచి వికాసమును వెల్లివిరియఁజేయు సాధన మిది యొక్కటియే.

సామాన్య మానవునివలన భావశక్తి నూటికిఁ దొంబదిపాళ్లు వ్యర్థము చేయఁబడుచుండుటచే నిరంతర మాతఁడు పొరపాట్ల కగ్గమగుచునే యుండును. సుశిక్షితుఁడగువాఁ డెన్నఁడును బొరపాటుపడఁడు. ఏకాగ్రతాశక్తి యందే నరులకును జంతువులకునుగల ముఖ్యభేదము. జంతు

వున నేకాగ్రతాశక్తి యత్యల్పము. జంతువు తనకుఁ దెలుపఁ బడిన విషయమును దఱచు మఱచిపోవుచుండుటచే దానికి బోధించుటయందలి కష్టము పెంపుడుజంతువులు కల వారల కనుభవసిద్ధము. జంతువు తనమనస్సును దేనియం దును దీర్ఘకాల మేకాగ్రము చేయఁజాలదు. ఇందే నరున కును జంతువులకును గల భేదము. మానవులయందైనను నొకరికిని మఱియొకరికినిగల భేదమెందున్నది?—ఏకాగ్రతా శక్తియందే. అత్యల్పుఁడగువాని నత్యుత్కృష్టునితోఁ బోల్చి చూడుఁడు. ఏకాగ్రతయందలి తారతమ్యముననే యిరువుర కును గల భేదము గోచరించును.

ఏ యుద్యమముననైనను నేకాగ్రతవలననే విజ యము సిద్ధించును. గానకవితాదులన్నిటియందును బ్రతి భాసంపద యేకాగ్రతాఫలితమే. చిత్త మేకాగ్ర మొనర్పఁ బడి యంతర్ముఖము గావింపఁబడినప్పు డంతశ్శక్తులన్నియు మనకు దాస్యమొనర్చును; వానికిఁక మన మధిపతులమై వెలయుదుము. యవనులు (గ్రీసు దేశీయులు) తమ యేకా గ్రతను బాహ్యప్రపంచమునఁ గేంద్రీకరించిరి; తత్ఫలితముగాఁ గళావాఙ్మయాదులందుఁ బరిపూర్ణత నొందిరి. హిందువులు తమదృష్టి నంతఃప్రపంచమున, అదృష్టాత్మరంగమున, లగ్నమొనర్చి యోగశాస్త్రమును వెలువరించిరి. ప్రకృతి ద్వారమును దట్టు విధానము మనకుఁ దెలిసినచోఁ బ్రపంచము తన రహస్యములను వెల్లడింప సంసిద్ధమైయున్నది. ఏకాగ్ర తవలన మనకట్టి బలము లభించును.

విషయసంగ్రహణము కాదనియుఁ జిత్తైకాగ్రతయే విద్యాభ్యాస మూలమనియు విద్యాసారమనియు నా యభిప్రాయము. నేను మరల విద్యాభ్యాసము చేయవలసివచ్చుచోఁ, ఇతరవిషయములను గమనింపనే గమనింపను; ఏకాగ్రతాశక్తిని, అసంగదృష్టిని వికసింపఁజేసికొని పరిపూర్ణ సాధనముతో స్వేచ్ఛగా సంగతులను సేకరింతును.

పంద్రెండేం డ్లస్ఖలితబ్రహ్మచర్యమును బరిపాలించువాని కపూర్వశక్తిసామర్థ్యములు లభించును. *సంపూర్ణబ్రహ్మచర్యము మహాధీశక్తిని విశేషాధ్యాత్మిక ప్రభావమును జేకూర్చును. కామము నిగ్రహింపఁబడినచో, మహోత్తమ ఫలప్రదాయకమై యొప్పును. కామశక్తి నాధ్యాత్మిక శక్తిగాఁ బరిణమింపఁజేయుఁడు. ఈ శక్తి బలీయమైనకొలఁదియు ఘనతర కార్యములను సాధింపనగును. ప్రబలజలధారయే జలయంత్రసాధనమున గనులు త్రవ్వుపని కుపయోగింపఁబడఁగలదు. బ్రహ్మచర్యము లోపించుటయే మన దేశక్షీణతకును బతనమునకును గారణము. అవిచ్ఛిన్న బ్రహ్మచర్యపరిపాలనమున సమస్తజ్ఞానమును నత్యల్పకాలముననే మనవశము కాఁగలదు; దేనినైనను నొక్కసారి వినినంతనే, లేక చదివినంతనే, మఱచిపోకుండునట్టి యేక సంథాగ్రహణశక్తి బ్రహ్మచర్యమువలననే లభించును. అకలంకమైన మనస్సద్భుతశక్తిమంతమును, మహాసంకల్పబలాన్వితమునై శోభించును. బ్రహ్మచర్యము లేనిదే యాధ్యా

---

* "బ్రహ్మచర్యప్రతిష్ఠాయాం వీర్యలాభః."

— పాతంజలయోగసూత్రములు, 2. 38

త్మికబలము కలుగఁజాలదు, బ్రహ్మచర్య మద్భుతమానవ వశీకరణసామర్థ్యమును జేకూర్చును. విశేషబ్రహ్మచర్యము నవలంబించినవారే లోకమున నాధ్యాత్మికనాయకులై విలసిల్లుచున్నారు; అదియే వారలశక్తిసామర్థ్యములందలి రహస్యము.

ప్రతిబాలుఁడును, ప్రతివిద్యార్థియు నస్ఖలితబ్రహ్మచర్యమును బరిపాలింప సుశిక్షితుఁడు కావలయును, బ్రహ్మచర్యముతోడనే శ్రద్ధాభక్తు లుదయించును, ఆత్మవిశ్వాస మేర్పడును. సర్వకాలసర్వావస్థలయందును మనోవాక్కాయములందు నైర్మల్యమే బ్రహ్మచర్యము. మలినకర్మమెంత చెడ్డదియో మలినభావము నంతచెడ్డదియే. మనోవాక్కాయముల నెడి త్రికరణములందును బ్రహ్మచారి వినిర్మలుఁడై యుండవలయును.

గురుకులవాసమే విద్యాభ్యాసము, ఇదియే నావిద్యాశయము. ఆచార్యుని జీవితము కట్టెదుటఁ బ్రకాశింపనిచో విద్యయనునదియే యసంభవము. ఎవ్వానిశీలము దివ్యతేజోవంతమై భాసించుచుండునో యట్టి మహనీయునితో బాల్యము నుండియు నివసింపవలయును. మహోత్తమబోధల కిట్టి సజీవ నిదర్శనము చిన్ననాటినుండియు విద్యార్థిప్రోల వెల్గొందవలయును, త్యాగులమూలముననే మనదేశమున సదా విద్యాదాన మొనర్పఁబడుచుండెడిది. జ్ఞానదానమును విద్యాదానమును త్యాగులే మరల నిర్వహింపవలసియున్నది.

భారతదేశమున నేఁటి విద్యావిధానమునకును

ప్రాచీన విద్యావిధానమునకును హస్తిమశకాంతరము. నాఁటి విద్యార్థులకు జీతములేదు. విద్య పరమపవిత్రము కావున దానిని విక్రయింపరాదని భావింపఁబడుచుండెడిది. విద్యాజ్ఞానముల నుచితముగా నొసఁగవలయును. గురువులు విద్యార్థుల కుచితముగా విద్యగఱపుటయేగాక, వారల కన్న వస్త్రములనుగూడ నొసఁగుచుండెడివారు. ఇట్టి గురుపోష ణార్థము సంపన్నకుటుంబములు కానుకల నర్పించుచుండ, వారు తమవిద్యార్థులను సంరక్షింపవలసియుండిరి. ప్రాచీన విద్యార్థి—బ్రహ్మచారి—సమిత్పాణియై గుర్వాశ్రమమున కేఁగ, గురు వాతని యోగ్యతను గనుఁగొని, మనోవాక్కా యములందు నిగ్రహ మవలంబింపవలయునని సూచించు మౌంజీబంధన మొనరించి వేదములను బోధింపసాగును.

గురుశిష్యలక్షణములు కొన్నికలవు. విశుద్ధత, నిజ మైన జిజ్ఞాస, ధృతియు ననునవి శిష్యుని ముఖ్యలక్షణములు. త్రికరణశుద్ధి యత్యావశ్యకము. జిజ్ఞాసవిషయమున మనము కోరునదేదియో యదియే మనకు లభించుననునది సనాతన నియమము. మనము దేనిని లక్షింతుమో యదియేకాని యన్య మెన్నఁడును మనకు లభింపఁజాలదు. ఉత్తమధర్మ జిజ్ఞాస కలుగు పర్యంతము, ఆత్మవిజయము చేకూరుపర్యం తము, మనలో నున్న పశుస్వభావముతో నిరంతరమైన పోరాటము—మహాకఠిన ప్రయత్నము — అనవరతమైన యుద్ధము—సాగింపవలయును. ఇట్టి పూనికగల శిష్యునకుఁ దుదకు విజయము లభించితీరును.

గురుని విషయమోయనిన, నాతఁడు శాస్త్రహృదయమును గ్రహించినవాఁడై యుండవలయును. లోకమంతయు వేదములను, బైబిలులను, కొరానులను జదువును; కాని యవి వట్టి మాటలు, వాక్యాన్వయములు, శబ్దనిష్పత్తులు, శబ్దశాస్త్రములు—తత్త్వశరీర శుష్కాస్థులు. ఎంతసేపు శబ్దవ్యాఖ్యానములతోఁ గాలక్షేపము చేయుచు శబ్దార్థమే పరమార్థమని భావించు గురువు శ్రుతితాత్పర్యమునకు వెలియగును.

గురునందుండవలయు రెండవలక్షణము పావనత్వము, పాపరాహిత్యము. 'గురుని శీలవ్యక్తిత్వములను మనము పరిశీలింపనేల ?'యని యనేకు లనుచుందురు. కాని యది సరికాదు. హృదయనైర్మల్యము లేనిదే యెవ్వఁడును సత్యమును గ్రహించి దాని నొరులకు బోధింపఁజాలఁడు. పరిశుద్ధుని మాటలే విలువకలవి. కేవలము శిష్యుని ధీశక్తినిగాని, మఱి యేయితరశక్తులనుగాని రగుల్కొల్పుటతో నాచార్యుని కర్తవ్యము తీరిపోదు; ఒకానొక ప్రభావమాతనియందుండి శిష్యునకు సంక్రమింపవలయును.

మూడవలక్షణ ముద్దేశసంబంధమైనది. స్వార్థమును మనసులో నిడుకొని ధనకీర్తులకొఱకై గురువు బోధింపరాదు. కేవల వినిర్మలప్రేమచే, విశ్వమానవప్రేమానురాగములచే నాతఁడు బోధనకుఁ బూనవలయును. ప్రేమద్వారముననే పారమార్థికశక్తి ప్రసరింపఁగలదు. స్వలాభము, ప్రఖ్యాతి

మొదలగు నే స్వార్థచింతయైనను నున్నచో, వెంటనే యీ ప్రేమద్వారము భగ్నమగును.

గురునియెడ విశ్వాసము, వినయము, విధేయత, గౌరవము ననునవి లేనిదే శిష్యునకు వికాసము కలుగఁజాలదు. ఈ గురుశిష్యసంబంధ మలక్ష్యము చేయఁబడు దేశములలో జరుగు ముచ్చట యిది: ఆచార్యుఁడు కేవల ముపన్యాసకుఁడైనాఁడు; ఆతఁడు తనకు రావలసిన పద్దిరూకలను జూచుకొనుచున్నాఁడు. శిష్యుఁడు తన తల నధ్యాపకుని వాక్యముల కడ్డ కిచ్చుచున్నాఁడు. ఈ మహాకార్యము కొంత కొనసాగినంతనే యెవరిత్రోవను వారేఁగుచున్నారు.

గురునిఁ బూజింపుము, సాక్షాద్భగవంతునిగా నారాధింపుము, కాని యంధప్రాయముగా వాని మాటల ననుసరింపకుము. పూర్ణగురుభక్తుఁడవయ్యును నీ యాలోచన వీడకుము.

బ్రహ్మవిద్యయే— పరమార్థమే— విద్యాసారము. మతమనునది— ధర్మమనునది — వాదప్రతివాదములతోఁగాని, సిద్ధాంతరాద్ధాంతములతోఁగాని కూడుకొనియుండు నట్టిది కాదు. అనుభూతితోడను శీలపరివర్తనముతోడను గూడుకొనియుండునదే మతము. మత మనఁగా సాక్షాత్కారము.

లోకమున మనము మహామేధానిధులమైనను బరమార్థమును దెలిసికొనకయే పోవచ్చును. విశేష ధీసంబంధ

మైన శిక్షణమువలనఁ బరమార్థవిముఖులు— అధార్మికులు —వెలువడుచుండుటయుఁ గలదు. హృదయమును లక్షింపక, శుష్కపాండిత్యమును లక్షించు విద్య పాశ్చాత్య నాగరికతా దోషములలో నొకటి. దానివలన మానవులు సహస్రగుణాధికముగా స్వార్థపరాయణు లగుచుందురు.

ప్రతివ్యక్తికి నున్నతాశయములను దెలిపి స్త్రీపురుషులకుఁ దమ కర్తవ్యమును దాము నిర్ణయించుకొన నవకాశ మొసఁగు నొక సంస్థను స్థాపించుటయే నా పరమాశయము. సర్వభూతములందును నేకాత్మ వెల్గొందుచున్నదని వేదాంతము ఘోషించుచుండ, నీ దేశమున స్త్రీపురుషుల నడుమ నంతటి భేదమేల పాటింపఁబడవలయునో నా కవగాహన కాకున్నది. పురుషులు లేనిపోని స్మృత్యాదులచే స్త్రీలను గఠినశాసన బద్ధురాండ్రను జేసి కేవల సంతానోత్పాదకయంత్రములుగా మార్చి వేసియుండుట శోచనీయము. పతనకాలమున మతాచార్యు లితరజాతులను వేదాధికారవిరహితులను జేసి స్త్రీలనుగూడ వారియధికారము లన్నిటినుండియుఁ దొలఁగించిరి. వైదికయుగమునను, నుపనిషద్యుగమునను గార్గి, మైత్రేయి మున్నగు నారీమతల్లులు ఋషులస్థానము నాక్రమించియుండుట కాన్పించును. వేదవేదాంతవిదులగు సహస్రబ్రాహ్మణులతోఁ గూడిన మహాపరిషత్తున గార్గి బ్రహ్మమునుగూర్చి తనతోఁ జర్చింప ధైర్యసాహసములతో యాజ్ఞవల్క్యు నాహ్వానించును.

స్త్రీల కనేక మహాసమస్య లెదుర్కొనుచున్నను,

విద్యయను మహామంత్రముచేఁ బరిష్కరింపఁబడఁ జాలని దేదియులేదు. మను వేమని విధించియున్నాఁడు? 'పుత్రుల వలెనే పుత్రికలనుగూడ విశేషశ్రద్ధతోఁ బోషించి విద్య చెప్పింపవలయును.' ముప్పదియేండ్లపర్యంతము బ్రహ్మచర్యమును బరిపాలించినపిమ్మట పుత్రుల నెట్లు వివాహితులను జేయవలసియున్నదో యట్లే పుత్రికలను బ్రహ్మచర్య మవలంబింపఁజేసి తల్లిదండ్రులు విద్య చెప్పింపవలసియున్నది. * కాని నిజముగా మన మేమి చేయుచున్నాము? వారల నెంతసేపు నిస్సహాయత్వమునను, బరాధీనతయందును శిక్షితురాండ్రను జేయుచున్నాము. అందువలనఁ గాసంతవిపత్తు కాని, ప్రమాదముకాని సమీపించినదన్నంతనే వారు బోరన విలపించుచుఁ గూర్చుందురు. స్వీయమార్గమునఁ దమసమస్యలను దామే పరిష్కరించుకొనునట్టి స్థితి వారలకుఁ గలుగఁ జేయవలయును. ఈ కార్యమొనర్ప మన భారతీయమహిళలు లోకమున మఱెవ్వరికిని దీసిపోరు.

దేశక్షేమమునకై తనబిడ్డలలోఁ గొందఱు విశుద్ధ బ్రహ్మచారులును బ్రహ్మచారిణులును గావలయునని భారతమాత కోరుచున్నది.

---

* షట్ త్రింశదబ్దికాం చర్యాం గురౌ త్రైవేదికం వ్రతమ్
తదర్ధికం పాదికం వా గ్రహణాన్తిక మేవవా,
వేదానధీత్య వేదౌ వా వేదం వాపి యథాక్రమమ్
అవిప్లుత బ్రహ్మచర్యో గృహస్థాశ్రమ మావసేత్.

—మనుస్మృతి, 3.1,2.

విద్యాసౌశీల్యశోభితలగు బ్రహ్మచారిణులు బోధన కార్యమును బూనవలయును. గ్రామములందును బట్టణము లందును విద్యాలయములను స్థాపించి స్త్రీవిద్యావ్యాప్తికై వారు పాటుపడలయును.

మతము, లలితకళలు, శాస్త్రము, గృహపరిపాల నము, పాకకళ, కుట్టుపని, యారోగ్యశాస్త్రము—వీనిలోని ముఖ్యవిషయములను మనస్త్రీలకు బోధింపవలయును. సీత, సావిత్రి, దమయంతి, లీలావతి, ఖానా, మీరాబాయి మున్నగువారల సచ్చరిత్రములు వారల స్ఫూర్తిరము నలంక రింపవలయును. విదుషీమణులు, పావనచరిత్రలునగు తల్లుల గృహములందే మహనీయు లుద్భవింతురు.

జనసామాన్యమున విద్యాబుద్ధులు వ్యాపించిన కొలఁ దియు దేశ మభివృద్ధిచెందుననుట విస్పష్టము. దేశీయభాష లలో జనసామాన్యమునకు—నిమ్నజాతులకు—బోధింపుఁడు. వారలకు విజ్ఞానమును—సంస్కృతిని—గలుగఁజేయుఁడు. సంస్కృతిలేని దే యుద్ధారణమున నిలుకడ కలుగఁజాలదు. దేశీయభాషలతోఁబాటు సంస్కృతవిద్యావ్యాప్తియు జరుగ వలయును.

జనసామాన్యమునకై హికాముష్మికవిద్యలను బోధించు ప్రచారకులకు శిక్షణ గఱపుటకై విద్యాసంస్థలను స్థాపించుటయే నా యభిమతము. ఐహికాముష్మికవిద్యా విధానమంతయు మనచేతులలోనే యుండవలయును; సాధ్య మైనంతవఱ కది జాతీయపద్ధతి ననుసరింపవలయును.

పదియవ ప్రకరణము

# అనుష్ఠాన వేదాంతము

అనుష్ఠానమునకు బొత్తిగా నయోగ్యమైన సిద్ధాంతము ధీసంబంధమైన వ్యాయామసాధనగా నుండుట తప్ప, మఱి యొక విధముగాఁ గేవలనిష్ప్రయోజనము. వేదాంతము నొక మతముగా—ధర్మముగాఁ—గైకొని చూచినచోఁ, అత్యంత మనుష్ఠానయోగ్యమై యుండవలయును. సర్వావస్థలయందును మనము దాని నాచరింపఁదగినదిగా నుండవలయును. అంతమాత్రమే కాదు, వ్యవహారమునకును బరమార్థమునకును గల కృత్రిమవైషమ్యము తొలఁగిపోవలయును; ఏలన వేదాంత మేకత్వమును బోధించును—సర్వ విషయములందును జీవన మభిన్నముగ నుండవలయునని శాసించును. మతాదర్శములు జీవనరంగమునం దంతటను సంపూర్ణవ్యాప్తి గలవై, మనభావము లన్నిటియందును, సంకల్పములన్నిటియందును జొచ్చి, విశేషముగా నను ష్ఠానములోనికి రావలయును.

...గ్రహింప దుస్తరమగు నద్వైతము కళాసంశోభితమై దైనందినజీవితమున సజీవమై యొప్పవలయును; దుర్భేద్యమైన పురాణములనుండి సుబోధమగు నైతిక సూత్రములు వెలువడవలయును; భీతి గొలుపు యోగ సంప్రదాయములనుండి యత్యంతశాస్త్రీయమును, ఆచరణ యోగ్యమునగు మానసికశాస్త్రము బయల్వెడల వల

యును—ఇదియంతయుఁ బసిబాలునకుసైతి మవగాహన మగు భాషాస్వరూపము నొందవలయును. ఇదియే నాజీవితోద్యమము.

వన గుహాంతరములనుండి వెలువడి యీ వేదాంత సిద్ధాంతము లెట్లు వ్యాపారసంకులములగు వీధులకును నగరములకును వ్యాపించి పరిణతి నొందినవో మనము గ్రహింపవలసియున్నది. ఈభావములనేకములు వనములలో ముక్కు మూసికొని కూర్చుండువారియందుండి కాక, అత్యంతము తీవ్ర ప్రవృత్తిపరులై — నిరంతర కార్యనిమగ్నులై — యుందురని మన మూహింపఁదగినవారియందుండి—రాజ్యపాలన మొనర్చు చక్రవర్తులయందుండి—వెలువడియున్నవి.

మీలో ననేకులు భగవద్గీతను జదివియుందురు, వేదాంత తత్త్వశాస్త్రమున కది యుత్తమోత్తమమైన వ్యాఖ్య; శ్రీ కృష్ణుఁడెం దీవేదాంతము నర్జునునకు బోధించెనో, అట్టి బోధనరంగము విచిత్రముగాఁ గదనరంగమై యుండుటయు, తీవ్రకార్యాచరణమునడుమ సంతతప్రశాంతి యనునదియే గీతయందలి ప్రతిపుటయందును బ్రస్ఫుటముగా వెల్గొందు సిద్ధాంతమై యుండుటయు... మనకు ద్యోతకము కాఁగలదు. వేదాంతమునకుఁ బరమావధియైన యీ సిద్ధాంతమే కర్మయోగరహస్యము. అకర్మము, అనఁగా మన మనుకొనునట్టి నిష్క్రియత, యెన్నఁటికిని మన గమ్యము కానేరదు. అటులైనచో, మన చుట్టునున్న గోడలే యత్యంతజ్ఞానవంతము లనవలసివచ్చును; అవి నిష్క్రియము—నిర్వాశ

పారము—కదా? మట్టిముద్దలు, చెట్లమోళ్లు, లోకమున కెల్ల మునిపుంగవులై యుండవలయును, అవియు నిష్క్రియము గదా? మఱియుఁ గామక్రోధాదులతోఁ గూడిన నిర్వ్యాపారతయుఁ గార్యపరత కాఁజాలదు. వేదాంతగమ్యమగు నిజమైన కార్యపరత సంతతప్రశాంతితో, ఒడుదొడుకు నొందని చిత్తప్రశాంతితో, ఏమి సంభవించినను సరియే, యాందోళనము నొందని సమచిత్తతతో నొప్పుచుండును. ఇదియే కర్మాచరణమున కత్యంతయోగ్యమగు మనోభావమని యనుభవమువలన మన కందఱకును దెలియఁగలదు.

సాధారణముగాఁ గర్మాచరణమున మన కనుభూతమగు కామము, లేదా, కోరిక లేనిదే. మన మెట్లు కర్మ మొనరింపఁ గలమని యనేకులు నన్నడుగుచుందురు. అనేక సంవత్సరములకు మునుపు నేనును నట్లే తలఁచితిని; కాని వయఃపరిపాకమున ననుభవము నొందినకొలఁదియు, అది వాస్తవముకాదని గ్రహించుచున్నాను. కామము, లేదా, కామవేగ మెంతతక్కువగా నుండునో మన కార్యాచరణ మంతచక్కఁగా నుండును. మనమెంత శాంతచిత్తులమైన, మనకంత శ్రేయస్కరము, మనము చేయఁగల కర్మమును నంతవిశేషము. మన మనోభావములను, గామాదులను జెలరేఁగనిచ్చినచో, మనశక్తిసామర్థ్యము లెంతయో వ్యర్థమగును, నాడీ దౌర్బల్యము కలుగును, మనస్సు ఒడుదొడుకు చెందును, అపుడు మన మే విశేషకార్యమును సాధింపఁ జాలకపోదుము. కార్యరూపమున వెలువడఁదగినశక్తి కేవల

కామాదిరూపమున వ్యయింపఁబడి నిష్ప్రయోజనమై పోవును. మనస్సు ప్రశాంతముగా నున్నప్పుడే శక్తి సామర్థ్యములన్నియు సత్కార్యాచరణమున వినియోగింపఁ బడఁగలవు. లోకమందలి మహాకార్యశూరుల జీవితచరిత్రలను మీరు గమనించినచో, వారత్యద్భుత ప్రశాంతచిత్తులని మీకుఁ దోఁచును. ఏమి సంభవించినను సరియే, సమచిత్తతను—స్థైర్యమును—గోల్పోయినవారు కారు వారు. కావుననే కోపియగువాఁడు విశేషకార్యములను సాధింపఁజాలకుండుటయు, దేనివలనను గోపము చెందనివాఁడెంతయో సాధించుచుండుటయుఁ గనుచుందుము. కామక్రోధాదులకు లొంగిపోవువాఁడు పనిచేయఁజాలఁడు, ఒడలంతయు 'హూనము చేసికొనుట' తప్ప, ప్రత్యక్షముగా దేనిని సాధింపఁజాలఁడు. శమదమాదులతో శోభించు మానసము వలననే మహాకార్యములు జరుగఁగలవు.

ఏకత్వమే వేదాంతమందలి ప్రధానాదర్శమని సదా మీరు మది నుంచుకొనవలయును. ఎందును ద్వైతమనునది లేదు; రెండు భిన్నజీవనములు లేవు; ఇహమున కొక జీవనము, పరమునకు మఱియొకవిధమైన జీవనము ననెడి భేదము లేనేలేదు; అది కృత్రిమము. వేదములు మొదట స్వర్గాదులనుగూర్చి ప్రసంగించినను, క్రమముగా వేదాంత మహోన్నతాదర్శములనుగూర్చి తెలుపుచో, వీనినన్నిటిని ద్రోసిరాజనును. ఒక్కటే జీవనము; ఒక్కటే ప్రపంచము;

ఒక్కటే యస్తిత్వము—సర్వమును నేకమే ; తారతమ్యమే కాని వాస్తవభేదము లేదు. మనజీవితములలో గోచరించు భేదము నిజమైన వర్గభేదము కాదు, అది యంశసంబంధమైన తారతమ్యము. జంతువులు నరులకంటె భిన్నములని కాని, నరుని కాహారముగా నుండ భగవంతునిచే సృష్టింపఁ బడెనని కాని— యిట్టి నీచభావములను వేదాంత మెంత మాత్రము ప్రతిపాదింపదు, అంగీకరింపదు.

భగవంతుఁడు నరులనెడి తనబిడ్డలయెడఁ బక్షపాతము వహించి, జంతువులనెడి బిడ్డలయెడఁ గ్రూరుఁ డగుచో, ఆ భగవంతుఁడు పిశాచముకంటె హీనుఁడనవలసి యుండును. అట్టివానిని బూజించుటకంటె నూఱుసారులైనను మరణించుట మేలనుకొందును. అట్టిదేవునితోఁ బోరాడుటకే నా జీవితము నంతయు వినియోగింతును. కాని యిట్టి భేద మేమియు లేదు; కలదనువారు తమబాధ్యతను గుర్తింపని దయావిహీనులును, అజ్ఞానులు నని చెప్పవలసియున్నది. విషయమేమన, "ఆచరణీయము," లేక, "అనుష్ఠాన యోగ్యము" అనుమాట యపార్థము చేయఁబడుచున్నది. నేను సరియైన శాకాహారిని గాకపోవచ్చును, కాని యీ విషయమున నాదర్శ మెట్టిదో నా కవగతమైయున్నది. మాంసము తినుచో, అది తప్పని నాకుఁ దెలియును; కొన్ని పరిస్థితులలోఁ దినుట తప్పనిసరియైనను, క్రూరమని నాకుఁ దెలియును. నా యాదర్శమును నా వర్తమానస్థితికి దింపి, నా దుర్బలవర్తనమున కీవిధముగా సాకులు గల్పింపఁ జూడ

దగదు. సర్వజంతువులును నా సోదరులే కావున, మాంసము దినకుండుటయే, ఏ జీవిని హింసింపకుండుటయే యాదర్శము, ధర్మము. అవి నీ సోదరులని భావింపఁగలుగుదువేని, సర్వ జీవసౌభ్రాత్రాదర్శవిషయమునఁ గొంతవికాసము నొందిన వాఁడవగుదువు. విశ్వమానవసౌభ్రాత్రముమాట యిఁకఁ జెప్పెడిదేమి ? వట్టి చిలుకపలుకులు ! అనేకుల కిది ప్రియముగా నుండదనుట వాస్తవము; ఏలన, ప్రత్యక్ష విషయములను — ఇంద్రియభోగములను—విడిచి, పరమాదర్శ మార్గమునఁ బురోగమింపుఁడని వేదాంతము బోధించును. కాని జనులు ప్రస్తుతవర్తనమున కనుకూలమగు సిద్ధాంతమును దేనినైనను జూపినప్పుడే సంపూర్ణానుష్ఠానయోగ్యముగాఁ బరిగణింతురు.

నీయం దెన్ని శక్తిసామర్థ్యములు, ఎంతటిప్రభావము, ఎన్నిమహిమము లణఁగియున్నవో నీకుఁ దెలియునా ? మానవునందలి మహత్త్వమును సర్వము నెఱింగిన శాస్త్రవేత్త యెవఁడు ? మానవుఁ డీలోకమున నవతరించి కోట్లకొలఁది సంవత్సరములు గడచినను, వానిశక్తులలో సహస్రాంశమైనను నింకను బ్రకాశితము కాలేదు. కావున 'నేను దుర్బలుఁడ'నని నీ వెన్నఁడును ననరాదు. పైకిఁ గాన్పించు క్షీణత మఱుఁగున నెన్ని సదవకాశము లున్నవో, సాధింపఁ దగిన యెన్ని మహాశక్తులున్నవో యెవ్వ రెఱుంగుదురు ? నీ తత్త్వమునుగూర్చి నీకుఁ దెలిసిన దత్యల్పము. నీ కాధార

భూతమై యనంతశక్తిసాగరము — అఖండసచ్చిదానంద సాగరము—వెల్లొందుచున్నది.

"శ్రోతవ్యః"—* ఆత్మనుగూర్చి మొట్టమొదట వినవలయును. నీ వాత్మవను విషయము నహర్నిశము వినుచుండుము. అది నీ రక్తనాళములలోఁ జొచ్చి, ప్రతిరక్తబిందువునందును స్పందించువఱకును, నీ సప్తధాతువులలోఁ, బంచకోశములలోఁ, బ్రవేశించువఱకును రేయింబవళ్లు మననము చేయుచుండుము. "నిత్యము, బ్రహ్మానందమయము, సర్వజ్ఞము, సర్వశక్తిమంతము, స్వయంప్రకాశమానము నగు నాత్మను నే" నను భావమున నీ తనువంతయు నిండి నిబిడీకృతము కావలయును. దివారాత్రము దీనినే మననముచేయుము; నీ జీవితముతో ఈ తత్త్వ మవినాభావ సంబంధము నొందువఱకును — ఐక్యమగువఱకును—మననముచేయుము, చింతనచేయుము. దీనినే సదా ధ్యానము చేయుము, అందుండి క్రియాశక్తి వెలువడఁగలదు. "నిండు హృదయమునుండి వాక్కులు వెలువడును" ("Out of the fullness of the heart the mouth speaketh") అను సామెత కలదు; నిండుహృదయమునుండియే క్రియలును వెలువడును; అందుండియే క్రియాశక్తి యుదయించును. ఆదర్శముతో నిండియుండుము; ప్రఫుల్లహృదయుఁడవై యుండుము. నీ వేమి చేసినను, దానిని గూర్చి పర్యాలోచింపుము. భావప్రభావ

* "శ్రోతవ్యో మన్తవ్యో నిదిధ్యాసితవ్యః."—బృహదారణ్యకోపనిషత్తు, 2. 4. 5.

ముచే నీ క్రియలు ద్విగుణీకృతశక్తిమంతములగును, పరిణామము నొందును, దివ్యములై శోభించును. జడపదార్థమే శక్తిమంతమైనచో, భావము సర్వశక్తిమంతము. ఈ భావమును నీ జీవితమున వర్తింపఁజేసికొనుము. నీ సర్వశక్తిమత్త్వమును, నీ యౌన్నత్యమును, నీ వైభవమును— గూర్చిన భావములతో నిండియుండుము.

వివేకమును వినియోగింప నేర్చికొనుటకు,—మన జీవితమున ననుక్షణమును, ప్రతిచేష్టయందును, ధర్మమేదియో, యధర్మమేదియో; సత్యమేదియో, యసత్యమేదియో తెలిసికొనఁగలుగుటకు—నైర్మల్యము, నేకత్వము ననెడి సత్యలక్షణములను గ్రహించియుండవలయును. ఏకత్వమును సిద్ధింపఁజేయున దంతయు సత్యము. ప్రేమ సత్యము. ద్వేషమసత్యము; ఏలన ద్వేష మనేకత్వమునకు—భిన్నత్వమునకు—దారితీయును. మానవులనడుమ భేదబుద్ధిని గల్పించునది ద్వేషమే, కావున నది దోషము, మిథ్య. అది విచ్ఛేదనశక్తి, భేదములను గల్పించి వినాశము గల్గించును.

అనుష్ఠాన వేదాంతము ప్రపంచమును గాదనదు, కాని దాని హేతుస్వరూపములను బోధించును; జీవుని ద్రోసిరాజనదు, కాని వాని సత్యస్వరూపమును బ్రకటించును; వ్యక్తిత్వమును ధ్వంసముచేయదు, కాని దాని యథార్థ స్వరూపమును వెల్లడించును, తత్కార్యకారణములను వివరించును. ప్రపంచము — సంసారము — నిరర్థకమనియు, లేనేలేదనియుఁ జెప్పక, "ఈ ప్రపంచము—ఈ

సంసారము—ఎట్టిదో తెలిసికొనుము, అపుడు బాధితుఁడవు గాకుందువు'' అని బోధించును.

ముఖ్యవిధానము సాధన, అనుష్ఠానము. ఎన్నఁటి కైనను సాధనయే కార్యసిద్ధికి మార్గము. మతము—బ్రహ్మ విద్య — యనుష్ఠానశాస్త్రము. దైవప్రోక్తమతమనునది యేదియుఁ బూర్వము వెలయలేదు, ముం దుండఁబోదు. మొదట సాధన, అనంతరము జ్ఞానోపలబ్ధి.

సర్వమును నాత్మనుండియే వెలువడుచున్నదని, ఆత్మ సర్వాంతర్యామియని గ్రహించి శుభాశుభములను బరిగ ణింపరాదని భావము; సంసారమును నిరాకరింపవలయునని, సంసారమునుండి దృష్టి మరల్పవలయునని భావము; స్వర్గ నరకములందును, జనన మరణములందును సమానముగనే యాత్మను గాంచవలయునని భావము...భూమి యాత్మ ప్రతీకము; ఆకాశ మాత్మ; మన మాక్రమించియున్న యీస్థల మాత్మ. సర్వము నాత్మయేఁ, బ్రహ్మమే. ఆత్మను గూర్చి ప్రసంగించినంతమాత్రమున, భావించినంతమాత్ర మునఁ, జాలదు,—వలయున దాత్మావలోకనము, ఆత్మ సాక్షాత్కారము.

వేదాంతము ననుసరించి చూచినచో, నిట్టి యను భూతి నొందినవాఁడే ముక్తుఁడు; అతఁడే యీలోకమున జీవింప నర్హుఁడు. ఇతరు లర్హులుకారు. దోషదర్శియగువాఁ డీలోకమున నెట్లు మనఁగల్గును? వానిజీవితము దుఃఖభూ యిష్ఠము. అనర్థములను బ్రమాదములను గాంచువాని

మనుగడ దుఃఖమయము. మృత్యువును జూచువాని బ్రదుకు దుఃఖపూరితము. తత్త్వదర్శియై, సర్వమునను దత్త్వమును గాంచినవాఁడే, "నే నీ జీవితానందము ననుభవించు చున్నాను, నా కీజీవిత మానందమయమై యున్నది" యని చెప్పఁగల్గును; అట్టివాఁడే యీలోకమున జీవింప నర్హుఁడు. ఈ సందర్భమున నొకవిషయమును దెలుపనగును: వేదము లలో నెచ్చటను నరకప్రసంగము లేదు, నరకసంబంధమైన భావమే లేదు. అది చాలకాలమునకుఁ బిమ్మటఁ బురాణము లందుఁ దలచూపుచున్నది. వేదముల ననుసరించి చూచి నచో, ఈ లోకమునఁ దిరిగి జన్మించుటే, మఱియొకసారి యైహికజీవితావశ్యకతను బొందుటె ఘోరతమశిక్ష. వేదము లలో నాదియుండియు భగవద్భావము నిర్గుణనిరాకార రూపమును దాల్చ నుద్యమించుచున్నట్లు గోచరించును. శిక్షాసంబంధమైనట్టియుఁ బ్రతిఫలసంబంధమైనట్టియు భావ ములు బహు స్థూలభావములు; మనవలెనే యొకరిని బ్రేమించుచు, మరియొకరిని ద్వేషించుచుండునట్టి మానవ లక్షణాన్వితుఁడగు భగవంతునివిషయమున మాత్రమే యవి వర్తించును. అట్టి భగవంతుఁడు కలఁడని విశ్వసించునప్పుడే శిక్షాశయమును బ్రతిఫలాశయమును ఆమోదనీయములు కాఁగలవు.

స్వయముగా మనహృదయమునందును బ్రతి జీవి యందును భగవంతునిఁ గనఁజాలనిచో, వానిని గాంచుటకై యెచటికిఁ బోవుట? "నీవే స్త్రీవి, నీవే పురుషుఁడవు, నీవే

బాలికవు, నీవే బాలుఁడవు. కఱ్ఱ నూఁతఁగాఁ గొని తూఁగాడు వృద్ధుఁడవును నీవే. బలగర్వమున సంచరించు యువకుఁడవును నీవే. '' * నీవే విశ్వమునఁ గల సర్వము, విశ్వమునందలి యద్భుతము, అద్వితీయమునగు తత్త్వమవు, సజీవప్రత్యక్షదైవమవు. ఇయ్యది సాంప్రదాయకమగు భగవద్భావమునకు,— భగవంతుఁ డెచ్చటనో తెరచాటున, అదృశ్యుఁడై, అగోచరుఁడై యుండునని తెలుపు పరంపరాగత భగవద్భావమునకుఁ— గేవలవిరుద్ధముగా నున్నట్లనే కులకుఁ దోఁపవచ్చును. తాముచెప్పినదానికెల్ల చిత్తమనుచు, తమ మందలింపులకుఁ జెవియొగ్గుచు, మనకోసము తాము నిర్ణయించిన మార్గమున జవదాఁటక వర్తించినయెడల,— మరణానంతరము భగవన్ముఖారవిందమును గాంచఁ గల్గునట్లు చేయుటకు మన కధికారపత్రము నిచ్చెదమని మతగురువులు మన కభయహస్త మిచ్చుచుందురు! ఈ స్వర్గాది భావము లన్నియు నర్థరహితమతాచార్యకైతవమునకు మాఱురూపములుగానిచో, మఱేమి ?

భయమువలన నీతిధర్మములు వికాసము చెందునని భావించుటెట్లు? అసంభవము. "ఎచట నొకఁ డన్యునిఁ గాంచునో, ఎచట నొకఁ డన్యుని బాధించునో, అదంతయు మాయ. అన్యునిఁ గాంచకుండునప్పుడు, అన్యుని బాధింప

* త్వం స్త్రీ త్వం పుమానసి త్వం కుమార ఉత వా కుమారీ, త్వం జీర్ణో దణ్డేన వంచసి త్వం జాతో భవసి విశ్వతో ముఖః.''— శ్వేతాశ్వతరోపనిషత్తు.

శుండునప్పుడు, సర్వ మాత్మయై భాసించునప్పుడు, ఎవ్వరి నెవరు చూచుట ? దేని నెవ్వరు కనుఁగొనుట ? ” * సర్వ మాత్మయే, సర్వము నేనే. ఇట్లు భావించు జీవుఁడు నిర్మలుఁడై యొప్పును. వానికే ప్రేమయననేమో యర్థమగును. భయమువలనఁ బ్రేమ కలుగఁజాలదు; ప్రేమనిలయము స్వాతంత్ర్యము, స్వేచ్ఛ. లోకమును నిజముగాఁ బ్రేమింప నారంభించునప్పుడే విశ్వమానవసౌభ్రాత్రమనఁగా నేమో, మానవకోటియనఁగా నేమో, మనకు బోధపడఁగలదు.

విముక్తులు కండు, స్వతంత్రులుకండు; ఎవ్వరిసాయము నపేక్షింపకుఁడు. మీ జీవితమునుగూర్చి మీరు సింహావలోకన మొనర్చితిరేని, ఇతరుల సాయమునకై సదా వ్యర్థ ప్రయత్న మొనర్చుచుంటిరనియు నట్టిదెన్నఁడును బ్రాప్తింపనే లేదనియు గ్రహింతురని నా నిశ్చయము. ఏదేని సాయము లభించియుండెనా, అదియంతయు మీయందుండియే వెలువడియున్నది. స్వయముగా మీరు దేనికై కృషిచేసితిరో తత్ఫలమునే మీరు వడసియుందురు.

---

* “యత్ర హి ద్వైతమివ భవతి తదితర ఇతరం జిఘ్రతి తదితర ఇతరం పశ్యతి తదితర ఇతరం శృణోతి తదితర ఇతర మభివదతి తదితర ఇతరం మనుతే తదితర ఇతరం విజానాతి, యత్రవా అస్య సర్వమాత్మైవాభూత్ తత్కేన కం జిఘ్రేత్ తత్కేన కం పశ్యేత్ తత్కేన కం శృణుయాత్ తత్కేన కం అభివదేత్ తత్కేన కం మన్వీత తత్కేన కం విజానీయాత్, యేనేదం సర్వం విజానాతి తం కేన విజానీయాత్ విజ్ఞాతారమరే కేన విజానీయాత్ ఇతి.”

—బృహదారణ్యకోపనిషత్తు, 2.4.14.

ఆశను విడనాడుమని వేదాంతము చాటును. మీ రాశపడు టెందులకు? సర్వము మీకుండనే యున్నది,—కాదు, మీరే సర్వము. దేనికై మీ రాశపడుట? ఒక రాజునకుఁ బిచ్చియెత్తి తనదేశపురాజును గాంచవలయు నని పరుగులిడ మొదలిడినాఁడఁట! తానే రాజై యుండఁ దనకు రాజు గాన్పించుటెట్లు? తన దేశమునఁ బ్రతిబట్టణ మునను, ప్రతిగ్రామమునను, ఇంటింటను వెదకులాడుచు, నేడ్చుచు, బొబ్బలిడుచు నాతఁడు తిరుగాడినను రాజును గనఁ జాలఁడు,—తానే రాజుగదా! మనమే బ్రహ్మమని తెలిసి కొని బ్రహ్మదర్శనమునకై యీ మూర్ఖాన్వేషణము విర మించుట మేలు; బ్రహ్మమని తెలిసికొనినచో, సుఖులమై సంతృప్తులమగుదుము. ఈ వెఱ్ఱివెదకులాట లన్నిటిని గట్టి పెట్టి, నాటకరంగమున నటకునివలె నీ విశ్వమున మీ మీ పాత్రానుగుణముగా నటింపుఁడు.

అటు లొనర్చితిరా, దృశ్యమంతయు మాఱిపోవును; శాశ్వత కారాగారమగుటకుబదులుగా నీ విశ్వమే క్రీడా రంగముగాఁ బరిణమించును; స్పర్ధకుఁ బుట్టినిల్లగుటకు బదులు కుసుమవికాసములతో, భ్రమరక్రీడలతో నొప్పారు సంతత వసంతనిలయమై శోభించును. ఇంతకుముందు నరకప్రాయ ముగానున్న యీప్రపంచమే స్వర్గధామమై వెలయును. బద్ధుని కన్నుల కిది ఘోరయాతనానిలయము, బుద్ధునికన్నులకో, ముక్తునికన్నులకో, ఆనందనిలయము. ఈ జీవనమే విశ్వజీవ నము, స్వర్గనరకములన్నియు నిచటనే యున్నవి. మానవుని

మూలరూపములగు సమస్త దేవతలును నిచ్చటనే యున్నారు. దేవతలు తమకుఁ బ్రతిరూపముగా మానవుని సృజింపలేదు, మానవుఁడే దేవతలను సృజించియున్నాఁడు. ఇఁక నిచ్చటనే మానవ ప్రతిరూపులగు నింద్రుఁడు, వరుణుఁడు, విశ్వమందలి సమస్తదేవతలును గలరు. మన చిన్నచిన్న ప్రతిరూపములను మనమే మనయందుండి వెలువఱుచుచున్నాము; ఈ దేవతలకు మౌలికరూపములము మనమే; మనమే పూజనీయదేవతలము, యథార్థదేవతలము; మన కంటె నన్యులు లేరు. ఇదియే వేదాంతమతము, ఇదియే యాచరణపరత్వము. ముక్తులమైనంతనే మతిహీనులమై సమాజమును విడనాడి, యే యరణ్యమునందో, కొండ గుహయందో మరణించుటకై పరుగెత్త నక్కఱలేదు, ఉన్న తావుననే యుందుము,—విశేషమేమన, యథార్థము మనకు బోధపడును,—అంతియే. పూర్వదృశ్యమే నిలిచియుండును, కాని నూతనార్థముతో వెలయును. విశ్వమనఁగా నేమో మనకింకను దెలియదు; ముక్తిమూలముననే యది యెట్టిదో, దాని స్వభావమేమో తెలియఁగలదు. నియమమనియు విధియనియుఁ బ్రారబ్ధమనియుఁ జెప్పఁబడున దంతయు మన స్వభావమున నత్యల్పాంశమునకుమాత్రమే వర్తించునని మనకపుడు తెలియఁగలదు. అది కేవల మొకవైపు, రెండవ వైపున ముక్తి భాసించుచునే యుండెను, కాని యది మనకుఁ దెలియలేదు. వేటకాండ్రచేఁ దఱుమఁబడుచుఁ, దన్ను రక్షించుకొనుటకై మొగము నేలను దాఁచుకొను కుందేటి

వలె దోషవిముక్తులమగుటకై మనము వ్యర్థప్రయత్నమొనర్చుచుంటిమి. మాయామోహితులమై మన స్వభావమును మఱవయత్నించుచుంటిమి, కాని మఱవఁజాలకుంటిమి; అది మనలను సదా మేల్కొల్పుచు, భాసించుచునేయుండెను; మన భగవదన్వేషణము, దేవతాన్వేషణము, లేదా, బాహ్యమోక్షాన్వేషణమంతయు మనయథార్థస్వభావాన్వేషణమే కాని మఱియొకటి కాదు. మనకు వినవచ్చిన వాణిని మనము వేఱుగాఁ దలఁచితిమి. అది యగ్నియందుండియో, యొకానొక దేవతయందుండియో, సూర్యునియందుండియో, చంద్రునియందుండియో, నక్షత్రములనుండియో వెలువడినదని భ్రమించితిమి, కాని తుదకది మనయందుండియే వెలువడినదని గ్రహించితిమి. నిత్యమోక్షమునుగూర్చి చాటు నీ శాశ్వతవాణి మనయందే కలదు, తదీయగానవాహిని నిరంతరము ప్రవహించుచునేయున్నది. ఈ యాత్మగానము నందలి యొకయంశమే భూమియై, నియమమై, యీ విశ్వమై యున్నది, కాని యది యెప్పుడును మనదే, మనదిగనే యుండును. ఒక్కమాటలోఁ జెప్పనెడ, మానవునియథార్థస్థితిని గ్రహించుటయే వేదాంతాశయము; ప్రత్యక్షబ్రహ్మస్వరూపమగు మీ సోదరమానవుని మీరు పూజింపఁ జాలరేని, యవ్యక్తపరబ్రహ్మమును మీ రెట్లుపాసింపఁ గలరనుటయే వేదాంతసందేశము.

"నీవు కన్నులారఁ జూచు నీసోదరుని ప్రేమింపఁ జాలనిచో, నీకగోచరుఁడగు భగవంతు నెట్లు ప్రేమింపఁగలవు?"

అను బైబిల్ వచనము * మీకు జ్ఞప్తిలేదా? మానవముఖమున మీరు దేవునిఁ గనఁజాలనిచో, మేఘములలో, లేక నిర్జీవజడపదార్థనిర్మితవిగ్రహములలో, లేక మీ మనఃకల్పితగాథలలో వాని నెట్లు గాంచఁగలరు? సమస్తస్త్రీపురుషులలో మీ రేనాఁడు భగవంతునిఁ గాంచనారంభింతురో, నాఁటినుండియే మీరు పారమార్థికులని చెప్పెదను; కుడిచెంపపై మిమ్ముఁ గొట్టినవానికి నెడమచెంపఁ జూపుట యనఁగా నేమో మీ కపుడు బోధపడఁగలదు. మానవుని బ్రహ్మస్వరూపముగాఁ గాంచఁగలిగిననాఁడు, సర్వమును—పెద్దపులినిసైతము—మీ రాహ్వానింపఁ గలుగుదురు. మన కేది ప్రాప్తించినను,—మన తండ్రి, మన తల్లి, మన మిత్రుఁడు, మన బిడ్డఁడు మొదలగు వివిధరూపములఁ దాల్చి మనకు దర్శన మిచ్చు పరమేశ్వరుఁడే, అల శాశ్వత పరమాత్మయేయని గ్రహింపఁ గలుగుదుము; మనతోఁ గ్రీడించుమన యంతరాత్మయే వారు.

మన మానవబాంధవ్యము లీవిధముగా దివ్యములొనర్పఁబడఁదగిన చందముననే, మన భగవత్సంబంధమును వీనిలో నేరూపమునైనను గైకొనవచ్చును; భగవానుని మన తల్లిగాఁగాని, తండ్రిగాఁగాని, మిత్రునిగాఁగాని, ప్రాణప్రియునిగాఁగాని భావింపవచ్చును. భగవంతుని మన తండ్రి

* "He that loveth not his brother whom he hath seen, how can he love God whom he hath not seen?"—St. John, Epistles, 4.20.

యని పిలుచుటకంటెఁ దల్లియనుట యున్నతాదర్శము, మిత్రుఁడనుట యంతకంటెను నుత్తమము, కాని మన ప్రాణ ప్రియుఁడనుట సర్వోత్తమము. ప్రియునకును బ్రియురాలికిని భేదమును గాంచకుండుటయే పరమోత్తమభావన. ప్రాచీన పారసీకగాథ యొకటి కలదు. దానిని మీరు వినియుందురు. ప్రియుఁడు తన ప్రియురాలి యింటిగుమ్మముకడకు వచ్చి తలుపుఁ దట్టఁగా, "ఎవరు వా"రని యామె యడుగును. "నే"నని యాతఁడు సమాధానింపఁగా బదులురాదు. రెండవ సారి యాతఁడు వచ్చి, "నేనే యిచ్చట నున్నది" యనును. అప్పుడును దలుపు తెఱవఁబడదు. మూడవతడవ వచ్చి నప్పుడు, "ఎవరు వా"రని లోపలినుండి వచ్చుప్రశ్నకు. "ప్రియురాలా! నీవే నేను" అని సమాధానింపఁ దలుపు తెఱవఁబడును. మనకు భగవంతునితోఁ గల సంబంధము నిట్టిదే. ఆతఁ డన్నిటను గలఁడు, అన్నియు నాతఁడే. ప్రతి పురుషుఁడును బ్రతిస్త్రీయును బ్రత్యక్షసజీవమూర్తియు కేవలానందమయుఁడు నగు భగవంతుఁడే. భగవంతు డజ్ఞాతుఁ డనువా రెవరు? వానిని వెదకి కనుఁగొనవలయు ననువా రెవరు ? మనము నిత్యము భగవంతునిఁ గనుఁగొ నుచునేయున్నాము. నిత్యము భగవంతునియందే మను చున్నాము. ఎల్లెడలను భగవంతుఁడు తెలియవచ్చుచునే యున్నాఁడు, సదా పూజింపఁబడుచునే యున్నాఁడు.

ఇతరోపాసనావిధానములు దోషములు కావని యిఁక నొక విషయము తేలుచున్నది. మనము మదినుంచు

కొనవలసిన ఘన విషయములలో నిది యొకటి,—మన కెంత మోటుగాఁ గనఁబడిననుసరియే, రూపములను గర్మకలాపములను గల్పించి భగవంతు నారాధించువారు దోషులు కారు. ఒకసత్యమునుండి మఱియొక సత్యమును, అల్పసత్యమునుండి ఘనతరసత్యమును బ్రాపించుటకై నరుఁడు కావించు యాత్రయే జీవయాత్ర. చీకటియనునది యల్పప్రకాశము; దోషమనునది యల్పగుణము. అపవిత్రతయనునది యల్పపవిత్రత. మనము నడిచినత్రోవనే యితరులును వచ్చుచున్నారను తెలివితో సానుభూతి వహించి ప్రేమదృక్కులతో వారి నవలోకించుట మన విధియని సదా మదినుంచుకొనవలయును. నీవు ముక్తుఁడవైనచో, ముందుఁగనో వెనుకఁగనో యందఱును ముక్తులగుదు రని తెలిసికొనఁగల్గుదువు. నీవు ముక్తుఁడవైతివా, నశ్వరమగునది నీ కెట్లు గోచరింపఁగలదు? నీవు నిజముగాఁ బరిశుద్ధుఁడవైతివా, యపరిశుద్ధమగునది నీ కెట్లు కాన్పింపఁగలదు? లోపలనున్నదియేకదా బయటనున్నది? మనలో మాలిన్యము లేనిదే బాహ్యమున దానిని గనఁజాలము. వేదాంతసిద్ధాంతముల ననుష్ఠానవిషయములలో నిది యొకటి. మన మందఱ మీ దృక్పథ మవలంబింపఁ బ్రయత్నింతముగాక. మన మీ ధర్మము ననుష్ఠానమునకుఁ గొనివచ్చుటకే మన యీజీవితము. దీనివలన మన కొక మహాలాభము చేకూరఁగలదు: సత్యస్వరూపమై వెలుఁగు బ్రహ్మము నిత్యము మనయందే కలదనియు, అది స్వతస్సిద్ధమనియు, దానిని బ్రకటీకరించి ప్రత్యక్ష

మొనర్చుకొనుటయే మన కర్తవ్యమనియు గ్రహించుటచే నసంతుష్టులమై, అతృప్తులమై వర్తించుటకు మాఱుగా సంతుష్టులమై, సంతృప్తులమై మహానందముతో విహిత కృత్యములను నిర్వర్తింపఁ గల్గుదుము.

భక్తిని వీడి, హృదయమును శుష్కింపఁజేసికొని, ప్రేమానురాగములను మంటఁ గలిపి, సంఘమునకు వెలియై మనిననేకాని జ్ఞానము లభింపదని సామాన్యముగా లోకుల భావన. ఆత్మసాధన కంతరాయములనెడి దుర్భావమున సోదరమానవులయెడలను జీవకోటియెడలను నిట్లు ద్వేషభావమును వహించి సాధకుఁడు పెడత్రోవ త్రొక్కుచుండును. కాని శ్రీరామకృష్ణుఁడు తన దివ్యభావమునఁ బల్కిన... మహోపదేశవాక్కులవలన, మానవుఁ డింటనుండియే, యతులును దాపసులును సంఘమును వీడి యొనర్చునట్టి తత్త్వజ్ఞానసాధన నొనర్పవచ్చునని నాకు విశదమైనది;— వేదాంతము నిత్యకృత్యములం దనుష్ఠానమునఁ జూపఁదగునని నాకు విశదమైనది. మానవుఁ డేయాశ్రమముననున్నను, ఏ వృత్తి నవలంబించుచున్నను సమస్తజీవకోటియు సాక్షా ద్భగవత్స్వరూపమేయని గ్రహించుఁగాక!... మానవ సేవయే మాధవసేవ.

స్వీయమోక్షప్రాప్తిచే నేమి ప్రయోజనము? మధు రాహారమును విశేష మనుభవించువాఁ డెవఁడు? అంతయుఁ దానే తినువాఁడా, అన్యులతోఁగూడి భుజించువాఁడా? సమస్తప్రపంచమును మనతోఁగూడ మోక్షసాధమునకుఁ

గొనిపోవలయును. ఈ మాయాప్రపంచమున మన మాధ్యాత్మికదావాగ్నినిఁ బ్రజ్వలింపఁజేయవలయును. అపుడే సచ్చిదానందసామ్రాజ్యమున సుప్రతిష్ఠితులమై వెలయఁగలము. ఓహో! శాశ్వతాత్మానందమున కెనయగు నానంద మెద్ది? 'సర్వభూతస్థమాత్మానం సర్వభూతానిచాత్మని' — తన్ను సర్వభూతములందును సర్వభూతములయందును దన్నుఁ గాంచునట్టి యా యనిర్వాచ్యస్థితిలో వివశులై మీరు బ్రహ్మానందసాగరమున నోలలాడెదరు.* సమస్తజీవులందును నిరుపమాన ప్రేమసానుభూతులను జూపుట మీ కపుడు నైసర్గికమగును. ఇదియే యనుష్ఠానవేదాంతము.

పదునొకండవ ప్రకరణము

## ప్రాక్పశ్చిమములు

స్వాతంత్ర్యములేనిదే వికాసమనునది కలుగనేరదు. మన పూర్వులు మతవిషయములలో స్వాతంత్ర్యము నొసఁగిరి: తన్మూలమున నద్భుతమైన మతము మనకు లభించినది. కాని సమాజశరీరమును వారు సంకెలలచే బంధించినారు—ఫలితమేమి? మనసమాజము రాక్షససమాజమైనది. పాశ్చాత్యదేశములందో, సమాజము సదా స్వాతంత్ర్యము ననుభవించుచున్నది—అందుచే ఆసమాజ మెట్లు వికాసము

* "సర్వభూతస్థమాత్మానం సర్వభూతానిచాత్మని, ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః." — గీత, 6.29.

నొందుచున్నదో చూడుఁడు. ఇఁక వారిమత మెట్లు సంకుచిత మైపోవుచున్నదో గమనింపుఁడు.

ఇపుడు ప్రాచ్యసంఘమునుండియేగాక, పాశ్చాత్య మతమునుండియు బంధములు సడలుచున్నవి.

ఒకవైపున సునిశితమైన ప్రత్యక్షశక్తులవినియోగ ముచే సంగృహీతమగు ప్రమాణములనెడి రథము నధిరో హించి, సహస్రసూర్యకాంతితోఁ గన్నులను మిర్మిట్లుగొల్పు నవీనపాశ్చాత్యవిజ్ఞానము; మఱియొకవైపునఁ బ్రాచీనభారత మహోచ్చదశయందలి పూర్వుల బలప్రదాయకాశాజనక మగు సంప్రదాయములు,—స్వదేశీయవిదేశీయమనీషులచేఁ బ్రకటితములై యుగయుగాంతరములనుండియు సర్వభూత ప్రేమానురాగములతో జాతీయశరీరమునందంతటను బ్రవ హించు మహాసంప్రదాయములు,—దేవతలకునైత మలభ్య మగు నపూర్వవీర్యమును, అమానుషప్రతిభను, అఖండా ధ్యాత్మికశీలమును బ్రకటించు దివ్యసంప్రదాయములు. ఒక వైపున భౌతికవాదము, ధనధాన్యసమృద్ధి, అఖండశక్తి సంచయము, ప్రబలవిషయసుఖములు—ఇవన్నియు విదే శీయవాఙ్మయమూలమునఁ గోలాహల ముదయింపఁజేసినవి; మఱియొకవైపున హీనస్వరమున,—అయ్యును విస్పష్టమగు రీతి, నీకోలాహలము నెట్లో భేదించుకొని, హృదయవిదా రణమై ప్రాచీనదేవతల యార్తనాదములు వినవచ్చుచున్నవి. కట్టెదుటఁ బాశ్చాత్యదేశములనుండి ప్రవేశించిన వివిధ విచిత్రభోగములు,—విచిత్రయానములు, విచిత్రపానములు,

సుసజ్జితభోజనములు, విద్యావతియగునారి లజ్జాహీనయై సంచరించు విచిత్రవేషభూషాదులు, నూతనభావములు, నూతనమర్యాదలు, నూతనరీతులు,—నివన్నియు నపూర్వ వాంఛలను రేకెత్తించుచున్నవి; మరల నీదృశ్యము మాఱి, యాతావున నిశ్చలగంభీరస్వరూపమున, సీతాదేవి, సావిత్రీదేవి, వ్రతములు, ఉపవాసములు, తపోవనములు, జటావల్కములు, కాషాయవస్త్రములు, కౌపీనధారులగుమునులు, ఆత్మానుసంధానము, (ఆనందనిలయమగు) సమాధిస్థితి—యివన్నియు దీపించుచున్నవి. ఒకవంక, స్వార్థము నాధారముగాఁ గొనిన పాశ్చాత్యసమాజముల స్వాతంత్ర్యము; మఱియొకవంక నార్యుల యఖండస్వార్థత్యాగము. ఇట్టి విషమసంఘర్షమున భారతీయసమాజ మాందోళనము నొందు టబ్బురముకానేరదు. పాశ్చాత్యుల గమ్యము వ్యక్తిగత స్వాతంత్ర్యము, భాష—ధనసంపాదకవిద్య, సాధనము—రాజకీయము; భారతీయుల గమ్యము ముక్తి, భాష—వేదము, సాధనము—త్యాగము.

నవీనభారతదేశము తాత్కాలికముగా నిట్లు తలఁచుచున్నదని చెప్పనొప్పును,—"ఎన్నఁడో కలుగఁబోవునదెడి యాముష్మికశ్రేయమను మోహమునకు లోనై, నా యైహిక జీవితమునంతయు నట్టేటఁ గలుపుకొనుచున్నాను;" కాని మంత్రముగ్ధవలె మరల నిట్లు వినుచున్నది:—

"ఇతి సంసారే స్ఫుటతరదోషః,
కథమివ మానవ తవ సన్తోషః?"

—ఓ మానవుఁడా! దోషభూయిష్ఠమగు నీసంసారమున నీసంతోషమున కవకాశ మెక్కడిది?"

ఒకవైపున నవ్యభారతదేశ మిట్లనుచున్నది: "వధూవరు లొండొరులను వరించుపట్ల మాకు సంపూర్ణస్వాతంత్ర్యము కావలయును; ఏలన, మా భావిజీవితసుఖదుఃఖము లన్నియు నెందు నెలకొనియుండునో యట్టివివాహమును స్వేచ్ఛగా నిర్ణయించుకొనుటకు మా కధికారముండవలయును." మఱియొకవైపునఁ బ్రాచీనభారతవర్ష మిట్లాదేశించుచున్నది: "వంశమును నిలుపుటకై సంతానార్థము కాని, వివాహ మింద్రియసుఖార్థము కాదు. సంతానము గనుటచే సాంఘిక భావిశుభాశుభములలో నీవు భాగస్వామి వగుచున్నావు, కావున నీవెవరినిఁ బెండ్లియాడవలయునో, ఎవరిని మానవలయునో శాసించుటకు సమాజమున కధికారము కలదు; సమాజక్షేమమున కేది యత్యంత మనుకూలించునో యట్టివివాహప్రణాళికయే యందుండును; బహుజనసుఖార్థము నీ వ్యక్తిగతసుఖేచ్ఛను ద్యజింపుము."

ఒకవైపున నవీనభారతదేశ మిట్లు పల్కుచున్నది: "పాశ్చాత్యభావములను బాశ్చాత్యవేషభాషలను బాశ్చాత్యాహారవిహారములను బాశ్చాత్యాచారమర్యాదలను మన మవలంబించినచో, మనమును బాశ్చాత్యులవలెనే బలవీర్యసంపన్నులమై యుందుము;" మఱియొకవైపునఁ బ్రాచీనభారతవర్ష మిట్లు ఖండించుచున్నది: "అవివేకులారా! అనుకరణమువలనఁ బరులభావము లెన్నఁటికిని మీవి

కానేరవు,— పులినిఁ జూచి నక్క వాఁతఁబెట్టుకొనినదనున ట్లార్జింపనిదే యేదియు మీది కానేరదు.''

ఒకవైపున నవీనభారతదేశ మిట్లు సాయించుచున్నది: ''పాశ్చాత్యజాతు లేమి చేయుచున్నవో, యది యంతయుఁ దప్పక మంచిది, కానిచో నవి యంతటి ప్రబలమెట్లైనవి?'' మఱియొకవైపునఁ బ్రాచీనభారతవర్ష మిట్లు ప్రవచించుచున్నది: ''బాలురారా! చూడుఁడు, మెఱుపు మిర్మిట్లు గొల్పుచున్నది, కాని దానిప్రాబల్యము క్షణకాలమే, కావున జాగ్రత!''

ఐనచోఁ బాశ్చాత్యులనుండి మనము నేర్చుకొనవలసిన దేమియు లేదా? అభ్యుదయము నొందుటకై మనము ప్రయత్నింపనక్కఱలేదా? మనము పరిపూర్ణులమా? మన సమాజ మకలంకమా? అం దేలోపమును లేదా?—మనము నేర్చుకొనవలసినవిషయము లనేకములు కలవు. ఆమరణము మనముప్రయత్నింపవలయును,—ప్రయత్న మేపురుషార్థము, మానవజీవితోద్దేశము. ''జీవించియున్నంతకాలము నేర్చుకొనుచునేయుందు''నని శ్రీరామకృష్ణుఁడు పలుకును. ఏవ్యక్తి, లేక యే సమాజము నేర్చుకొనవలసిన దేమియు లేకుండునో, దాని కవసానసమయము సమీపించిన దన్నమాటయే. కలదు,—కాని యందుఁ బ్రమాదమును గలదు.

అల్పబుద్ధియగు నొకయువకుఁడు శ్రీరామకృష్ణునిసముఖమున నెప్పుడును శాస్త్రములను నిందించువాఁడు. ఒకనాఁ డాతఁడు గీతను విశేషముగాఁ బ్రశంసించెను; అంతట

శ్రీరామకృష్ణుఁ డిట్లు వచించెను: "చూచితిరా? ఎవరో యొరోపాపండితుఁడు గీతను బ్రశంసించెననుకొందును, కావున నీతఁడును బ్రశంసించినాఁడు."

ఓ భారతీయులారా! ఈ మహాప్రమాదమును గుర్తింపుఁడు. పాశ్చాత్యానుకరణవ్యామోహము మిమ్మావహించియున్నది, కీడేదియో, మేలేదియో, వివేకముచే, విచక్షణచే, శాస్త్రప్రమాణములచే మీరిఁక నెంతమాత్రము నిర్ణయించుకొనుటలేదు. పాశ్చాత్యులు—శ్వేతముఖులు—కొనియాడిన భావములెల్ల, ఆమోదించిన యాచారములెల్ల, మంచివి; ఇఁక వారికి రుచింపనివెల్ల, వారు దూషించిన వెల్ల చెడ్డవి! ఆహా! మాఢ్యమున కింతకంటెఁ బ్రత్యక్ష నిదర్శన మేముండును?

పాశ్చాత్యస్త్రీలు స్వేచ్ఛగా నెల్లెడలను సంచరింతురు,—కావున నది మంచిది; వారు స్వయముగాఁ దమ భర్తలను వరింతురు,—కావున నది యున్నతికి మహోన్నత సాధనము; పాశ్చాత్యులు మన వేషభూషణములను నాహార విహారములను నామోదింపరు,—కావున నవి చాల చెడ్డవి; పాశ్చాత్యులు విగ్రహారాధన దోషమందురు,—విగ్రహారాధన మహాదోషము, సంశయమేమి?

పాశ్చాత్యు లేకేశ్వరారాధన శ్రేయస్కరమందురు,—కాఁబట్టి మన దేవతలనందఱిని గట్టగట్టి గంగలోఁ గలిపి వేయుదము!—పాశ్చాత్యులు జాతిభేదములు నింద్య మందురు,—కావున సర్వజాతులను—సర్వవర్ణములను—

గలిపివేయుదము! పాశ్చాత్యులు బాల్యవివాహము సర్వ దోషాకరమందురు,—కావున నదియుఁ జాల చెడ్డదనుటకు సందియము లేదు !

ఈ యాచారములన్నియు రక్షణీయములా, త్యాజ్యములా యనువిషయమును మన మిచటఁ జర్చించుటలేదు; కాని మన యాచారసంప్రదాయములు మూలఁబడవలయుననుటకుఁ బాశ్చాత్యుల నిరసనమే ప్రమాణమన్నచోఁ, గాదనుట మన కర్తవ్యము.

ప్రస్తుతలేఖకునకుఁ బాశ్చాత్యసమాజమునుగూర్చి కొంచెము ప్రత్యక్షజ్ఞానము కలదు. తన్మూలమున నాతనికిఁ గలిగిన నిశ్చితాభిప్రాయ మేమనఁ, బ్రధానగమనవిషయమునను గమ్యవిషయమునను బ్రాచ్యపాశ్చాత్యసమాజముల నడుమ నపారమైన భేదముండుటచే, భారతదేశమునఁ బాశ్చాత్యపద్ధతి ననుకరించుచు, నే సంప్రదాయము బయల్వెడలినను నది విఫలమైపోవును. పాశ్చాత్యసమాజమున నెన్నఁడును మసలనివారగుటచే, స్త్రీపురుషులసమావేశమును గూర్చి యచట నున్నట్టియుఁ, బాశ్చాత్యస్త్రీలపవిత్రతను గాపాడుటకై యుద్దేశింపఁబడినట్టియు నచటి సాంఘికవిధినిషేధముల నిసుమంతయు నెఱుంగక, మనసమాజమున నదుపాజ్ఞలులేని స్త్రీపురుషస్వేచ్ఛాసమావేశములకుఁ దలయూఁపువారియెడ మా కెంతమాత్రమును సానుభూతి లేదు.

భారతీయు లైరోపీయ (European) వేషభాషలను దాల్చుచుండుట చూచినప్పుడు నే నిట్లనుకొనుచుందును;—

నిరక్షరకుక్షులు, దరిద్రులు, అధఃపతితులు నగు భారతదేశీయులతో సజాతీయతను సంబంధమును నంగీకరించుట బహుశః వారికి సిగ్గుగా నున్నదికాఁబోలును!!...

శిఖ నుంచుకొనుటకుబదులు 'క్రాపు'నుంచుకొని పాపటదువ్వుకొనుచు, తమపూర్వాచారసంప్రదాయములను విడనాడి, సగము ప్రాచ్యునివలెను, సగ మప్రాచ్యునివలెను దోఁచెడి 'యర్ధ యూరోపియన్ వేషము' ధరించి, సర్వసాంకర్యసన్నివిష్టులై, నవీనాగతపాశ్చాత్యమర్యాదల నవలంబించు బ్రాహ్మణబ్రువుల బ్రాహ్మణత్వమున సమాజమునకు విశ్వాసము లేదు.

ఓ భారతీయులారా! పరులవెంటఁ బడి ప్రాఁకులాడు నిట్టి పరానువాదముతో, ఈ పరానుకరణముతో, ఈ పారతంత్ర్యముతో, ఈ దాస్యదౌర్బల్యముతో, ఈ నీచనిందిత—క్రౌర్యముతో,—ఈసంపదతో నేనా, విజ్ఞానగౌరవశిఖరముల నధిరోహింపఁ దలఁచుచున్నారు? వీరభోగ్యమగు స్వాతంత్ర్యము మీలజ్జాకరభీరుత్వముచే నెన్నఁడైనను మీకు లభింపఁగలదా?...

ప్రతిజాతియందును బ్రత్యేకలక్షణములు గోచరించుచుండును. పారమార్థికదృష్టి, లేదా, అంతరవలోకనపరత్వము భారతీయులందును, వైజ్ఞానికదృష్టి, లేదా, బాహ్యావలోకనపరత్వము పాశ్చాత్యులందును విలక్షణమై కాన్పించును. పరమార్థమునంతయుఁ బాశ్చాత్యులు సాంఘికవికాసమూలమునఁ బడయఁగోరుదురు; ప్రాచ్యులో, సమస్త సాంఘికశక్తులను బరమార్థమూలమునఁ జేపట్టఁదలఁతురు.

హిందూసంఘమును సంస్కరింపవలయునన్నచో, సనాతన ధర్మమును నిర్మూలించుటకంటె మఱియొకమార్గము లేదని నవీనసంస్కర్తలకుఁ దోఁచుట కిదియే హేతువు. వారు ప్రయత్నించి విఫలులైనారు. ఎందువలన? వారిలో నెవ్వరును స్వీయమతధర్మములెట్టివో పరిశీలింపకుండుటవలన— సమస్తమతధర్మములకును దల్లియనఁదగు సనాతనధర్మతత్త్వమును గ్రహించుటకు వలయు శిక్షణమును బొందిన వ్యక్తి వీరిలో నొక్కఁడును లేకుండుటవలన. హిందూసంఘమును బాగుపఱచుట కెట్టి. ధర్మవినాశనమును జేయనక్కఱ లేదనియు, నేఁటి సాంఘికదుఃస్థితికి మూలము మతధర్మము లెంతమాత్రము గావనియు వానిని సంఘమున కనువర్తింపఁ జేయకుండుటయే హేతువనియు నేను నొక్కి వక్కాణింతును. ఇందలి ప్రత్యక్షరమును మన వేదశాస్త్రములనుండి నిరూపింప సంసిద్ధుఁడనైయున్నాను. ఇదియే నా హితోపదేశము. దీనిని నిర్వహించుటకు యావజ్జీవము, యావచ్ఛక్తి తోడను బ్రయత్నింపవలసియున్నది.

మొత్తముమీఁద మన పేదహిందువులే పాశ్చాత్యదేశీయులందఱికంటెను గోటిరెట్లు విశేషపారమార్థికశీలురు. మతధర్మములపట్ల వారు (పాశ్చాత్యులు) మోసమును లేదా, మూర్ఖాభిమానము నవలంబింతురు. సమాలోచనపరులు మూఢవిశ్వాసయుతములగు తమ మతములనిన విసువు చెంది నూతనవికాసార్థము భారతదేశముదెసఁ జూచుచున్నారు. నవీనభౌతికశాస్త్రములదాడి నెదిర్చి నిలువఁగలిగిన

మన పవిత్ర వేదములందలి ప్రతిదివ్యాశయము నెంతటితమక ముతో—ముక్కవతోఁ—బాశ్చాత్త్యులు స్వీకరించు చున్నారో వచ్చిచూచినచో, మీకుఁ దెలియఁగలదు. శూన్య మునుండి సృష్టి బయలుదేఱినదను రిక్తవాదము—ఆత్మ సృజింపఁబడినదను వెఱ్ఱి సిద్ధాంతము—స్వర్గము (Heaven) అను నొకానొకతావున సింహాసనారూఢుఁడై దేవుఁడను నొకమహాచండశాసనుఁడు గలఁడను మూఢసిద్ధాంతము—శాశ్వతఘోరనరకములు గలవను పిడివాదము—నివన్నియు విద్యావంతులకు విసుగుఁ బుట్టించినవి; సృష్టియు నాత్మయు శాశ్వతమనియు—దేవుఁడు మనయంతరాత్మయే యనియుఁ బ్రకటించు నుత్కృష్టవైదికభావముల నేదియో యొకరూప మున వారందఱును త్వరితగతి నవలంబించుచున్నారు. అర్ధ శతాబ్దములోపుననే ప్రపంచమునందలి విద్యాధికులు మన పావనవేదములలోఁ దెలుపఁబడినరీతిని సృష్టియు నాత్మయు శాశ్వతములనియు మహోత్తమము, పరిపూర్ణమునగు మన తత్త్వమే భగవంతుఁడనియు నమ్మితీరెదరు. వారి మతా చార్యులలోఁ బ్రాజ్ఞులగువా రిపుడే బైబిలు నీవిధముగా వ్యాఖ్యానించుచున్నారు. వేయేల, పాశ్చాత్త్యులకు విశేష ముగాఁ బారమార్థికనాగరికతయు మనకు విశేషముగా నైహికనాగరికతయు నావశ్యకమై యున్నవని నా యభి ప్రాయము.

పేదలదుఃస్థితియే హిందూదేశమునందలి చెడుగుల కన్నిటికిని బుట్టినిల్లు. పశ్చిమఖండమునందలి పేదలు కేవల

రాక్షసులు ; వారితోఁ బోల్చి చూచినచో, మనవారు దేవత లని చెప్పవచ్చును, అందుచే మన పేదలను లేవ నెత్తుట యంత కష్టసాధ్యమైన పని కాదు. విద్య నేర్పుట, వారు కోల్పోయిన వ్యక్తిత్వమును వెలువడఁజేయుట—ఇదియే పేదలకు మనము చేయవలసిన సేవ. దేశీయప్రభువులు జనసామాన్యము నుద్ధరించుటకుఁగాను జేయవలయు మహాకార్యమిది. ఇంత వఱకీ విషయమునఁ గలుగఁజేసికొనినవా రెవ్వరును లేరైరి. మతాచార్యుల నిరంకుశాధికారముచే నేమి, విదేశీయులవలని యోటమిచే నేమి, యనేకశతాబ్దములనుండియు జనసామాన్య మధఃపతితమైయున్నది. తుదకుఁ దాము మానవులమను మాటనే మఱచిపోయినారు మన పేదలు. వారికి మనము సదాశయములను దెలుపవలసియున్నది; తమచుట్టును లోకమున నేమి జరుగుచున్నదో కన్నులు విప్పి చూపవలసి యున్నది. అపుడు స్వయముగనే వారు తమవిమోచనమును సాధించుకొనఁ గలరు. ప్రతిజాతియుఁ బ్రతిపురుషుఁడును బ్రతిస్త్రీయును దనవిమోచనమును దానే సాధించుకోవలయును. జనులకు సదాశయములను దెలుపుఁడు—వారికి వలయు సాయ మిదియే, మిగిలినదంతయుఁ దన్మూలముననే జరిగితీరును. రసాయనముల నొండొంటితోఁ జేర్చుటయే మనపని, ప్రకృతినియమముల ననుసరించి స్వయముగనే స్ఫటికమేర్పడును. జనుల కాశయములను గలుగఁజేయు నంతవఱకే మన కర్తవ్యము, మిగిలిన పనియంతయు వారిదే. ఇదియే భారతదేశమున మనము చేయవలయు కార్యము.

ఐహికనాగరికతనుగూర్చి మన మేమేమో ప్రలాపించు చుందుము. ద్రాక్షపళ్లు పులుపన్నదఁట నక్క! మాటవరుస కామూర్ఖప్రలాపముల నన్నిటిని యథార్థమేయని యంగీక రించినను భారతదేశమందంతటను నొకలక్షమంది నిజమైన పారమార్థికు లుందురేమో. ఇఁక వీరిపారమార్థికసాధనలకై ముప్పదికోట్లమంది జనులు నిరాహారులై, పశుప్రాయులై, తమస్సునఁ బడి తల్లడిల్లవలసినదేనా? ఎవ్వరైన నెందులకుఁ బస్తుపడియుండవలయును? మహమ్మదీయులచే హిందువులు జయింపఁబడు టెట్లు సంభవించినది? ఐహికనాగరికతను హిందువు లెఱుఁగకుండుటచే సంభవించినది. కుట్టఁబడిన దుస్తులను గట్టుకొనుట మహమ్మదీయులు హిందువులకు నేర్పిరి. వీధులలోని ధూళితోఁ గలియకుండఁ దమయాహా రమును శుచిగా నెట్లు తినవలయునో మహమ్మదీయులు హిందువులకు నేర్పిన బాగుండెడిది! పేదలకుఁ బని కల్పించు టకై యైహికనాగరికత కాదు, భోగములుసైత మావశ్యక మని చెప్పెదను. అన్నము! అన్నము! ఈలోకమున నాకు అన్నము పెట్టఁజాలక యెక్కడనో పరలోకమున శాశ్వత బ్రహ్మానందము నొలకఁబోయునను దేవునియందు నాకు నమ్మకములేదు. ఇస్సీ! భారతదేశ ముద్ధరింపఁబడవలయును. మతాచార్యుల—పురోహితబ్రువుల—దుండగములను నిర్మూ లింపవలయును. మతాచార్యకైతవ మింకఁ జెల్లదు, సాంఘిక నిరంకుశాధికార మింకఁ జెల్లదు; వలయునది ప్రతివ్యక్తికిని మఱియొక కబళమన్నము, (అభ్యుదయమునకుఁగాను) మంచి

కొంత యవకాశము! ఆంగ్లేయులయొద్దనుండి మఱికొన్ని హక్కులను బొందు తలంపున మన "యువక మూర్ఖులు" సభలుచేయుచుందురు. వారు (ఆంగ్లేయులు) ఊరక నవ్వుచుందురు. ఒరులకు స్వాతంత్ర్యము నీయ సంసిద్ధులు కాని వారు స్వయముగాఁ దాము స్వాతంత్ర్యము నొందుట కెట్లర్హులు? మాటవరుస కాంగ్లేయులు మిమ్ము సమస్తాధికారములకును బట్టాభిషిక్తులను జేయుదురనుకొందము. చెప్పనేల? అధికారులగువారు జనసామాన్యమును కాలిక్రిందవేసి త్రొక్కుదురు. వారు జనసామాన్యమును స్వాతంత్ర్యము ననుభవింపనిత్తురా? బానిస లొరులను బానిసలనుజేయుట కే యధికారము గోరుదురు.

ప్రాక్పశ్చిమ దేశములకుఁ గల భేదమంతయు నిది: పశ్చిమ దేశములు జాతీయాశయములు గల సంఘములు, మనము కాము; అనఁగా నాగరికతయు విద్యయు నచట సర్వజనసాధారణములు, జనసామాన్యమున నివి ప్రవేశమందినవి; హిందూ దేశమునను నమెరికా దేశమునను నగ్రజాతులు సమానమే కాని రెండిటియందలి నిమ్నజాతులకుఁ గలభేదము హస్తిమశకాంతరము. ఆంగ్లేయులు హిందూదేశము నంత సులభముగా జయించుటకుఁ గల కారణమేమి? వారొక సంఘమైయుండుటయు మనము కాకుండుటయునే. మనదేశములోని ఘనులలో నొకఁడు గతించిన, మఱియొకఁడు లభించుటకు మనము శతాబ్దములపర్యంతము కనిపెట్టుకొని యుండవలయును—ఆంగ్లేయసంఘమో, తనయందు ఘను

లగువారు గతించియు గతింపకమునుపే యితరుల నట్టివారిని వెలువరించును....ఏ మూఁడు నాలుగు, లేదా, ఆఱుకోట్ల జనాభానో కలిగియున్న సంఘములతోఁ బోల్చిచూచినచో, ముప్పదికోట్ల జనాభా గల (మన) సంఘ మెప్పటికప్పుడు ఘనులను సమకూర్చుకొనఁ జాలకున్నది. దేశమున వలసి నంతమంది విద్యావంతులగు స్త్రీపురుషులు లేకుండుటయే యిందులకు హేతువని వేఱుగఁ జెప్పనక్కఱలేదు...మన సంఘమందలి మహాలోపమిది, దీనిని మనము తొలఁగించుకో వలయును. జాతీయభావము గల సంఘము నిర్మింపఁబడ వలయునన్నచో, విద్యగఱపి జనసామాన్యమును లేవనెత్త వలయును. పుం డెచటనున్నదో మనసంఘసంస్కర్తలు చూడరు, విధవావివాహములమూలమున వారు మనసంఘము నుద్ధరింపఁదలఁతురు—సంఘసముద్ధరణము విధవలకు లభింపఁ గల భర్తలసంఖ్యపై నాధారపడియుండుననియా మీ యభి ప్రాయము? దోషము మన సనాతనధర్మమునకును నంటఁ గట్టఁదగదు—ఏమందురా, ఒక విగ్రహ మెక్కువయైనను దక్కువయైనను దుదకొక్కటియే. ఉన్నదోషమంతయు, లోపమంతయు, నిది: కుటీరమున నివసించు నిజమైన సమాజము తన మానవత్వమును వ్యక్తిత్వమును గోల్పోయినది, మఱచిపోయి నది. ఏ హిందువులో, మహమ్మదీయులో, క్రైస్తవులో, కాలి క్రిందవేసి త్రొక్కివేయుచుండఁ, జేతఁ బదికాసులున్న ప్రతి వ్యక్తిచేతను దాను ద్రొక్కఁబడుటకే పుట్టితినని తలఁచునట్టి దుఃస్థితికి దిగినది మన సమాజము. పేదలు కోల్పోయిన

వ్యక్తిత్వమును దిరిగి వారి కొసంగవలయును. వారిని విద్యా వంతులను గావింపవలయును. విగ్రహములు నిలుచునా, కూలునవా, విధవలకు వలసినంతమంది భర్తలు దొరకుదురా, దొరకరా, వర్ణవ్యవస్థ మంచిదా, చెడ్డదా—యనునిట్టి సమస్యలనుగూర్చి నాకేల లేనిపోని తాపత్రయము? ప్రతి వ్యక్తియుఁ దన మోక్షమును—తరణోపాయమును—దానే సాధింపవలసియున్నది....జనులకు మన ముత్తమాశయము లను గలుగఁజేయుదము, మిగిలినదంతయు వారు చేయవల సిన పనియే. అనఁగా జనసామాన్యమునకు మనమిపుడు విద్య గఱపవలసియున్నది. ఇందలి చిక్కులివి: దరిద్రప్రభు త్వమేమియుఁ జేయఁజాలదు, చేయదు. కావున, ఆ వైపు నుండి సాయము లభించుననుకొనుట కలలోనివార్త.

ప్రస్తుతకాలావశ్యకతను గుర్తింప...(విదేశీయులగు వీరు) పరిపూర్ణప్రబోధము నొందినట్లు కాన్పించును...ఇఁక జీవితమంతయు నర్థరహితప్రసంగములుచేయు వట్టి 'కబుర్ల రాయ'ళ్లగు మీరో,...వచ్చి యీ... దేశీయులను జూచి సిగ్గుచేఁ దలవంచుకొనుఁడు. స్వమతదురభిమానమున మతి హీనులగు మీరు బయటికి వచ్చినంతనే జా-తి-భ్ర-ష్ట-త సిద్ధించును మీకు, పా-ప-ము! "ఈ యాహారము స్పృశ్య మా, ఆ యాహారము స్పృశ్యమా?" యను చర్చలతో శక్తిసామర్థ్యముల నన్నిటిని శతాబ్దములనుండి వ్యయించుచు, బహుయుగపర్యంతమగు సాంఘికరాక్షసశాసనములచే మానవత్వమనున దడుగంటఁ, గరుడుకట్టిన ఛాందసముచే,

మూఢవిశ్వాసములచేఁ దల దిమ్మెత్తి, శతాబ్దములకొలఁది చతికిలపడియున్న మీరో,—మీ స్థితి యెట్లున్నది? ఇఁక మీరిపుడు చేయుచున్నదేమి?...“పుస్తకం హస్తభూష ణమ్” అనునట్లు చేతులలోఁ బుస్తకములతో సముద్రతీర మున విహరించుచు, నైరోపాధీసంజాతమైన యే (భౌతిక) శాస్త్రమునుండియో నాలుగుముక్కలు ముక్కున కంటించు కొని వాని నేకరువుపెట్టుచు, యావదాత్మను ముప్పదిరూకల ‘గుమస్తాపదప్రాప్తి’పై లేదా, యువభారతదేశమున కాశా పరమావధియనఁదగు ‘లాయరుపదవి’పై లగ్నమొనర్చి— యిఁకఁ బ్రతివిద్యార్థియు క్షుద్బాధచే నల్లాడు పిల్లలపటాల మాహారముకొఱకుఁ ‘గాకుర బీకుర’ మనుచుఁ దనవెంటఁ బడి దేవిరించుచుండ—మీరిపుడు చేయుచున్నదేమి?... మిమ్ములను, మీ పుస్తకములను, మీ గౌనులను, మీ విశ్వ విద్యాలయ బిరుదములను సమస్తము ముంచివేయఁ జాలినంత నీరు సముద్రమున లేదా?

లెండు, మీ పౌరుషమును బ్రకటింపుఁడు! సదా పురోవృద్ధి నరికట్టు పురోహితప్రభువులను మతాచార్యులను లేశమును లక్షింపకుఁడు. ఏలందురా, వారిమనస్సు లిఁక మాఱవు, వారిహృదయములు వికసింపవు. తరతరముల నుండి వచ్చుచున్న మూఢవిశ్వాసములును రాక్షసశాసన ములును వారిని గన్నతల్లులు. మతాచార్యకైతవమును నొకటివేళ్లతోఁ బెల్లగించివేయుఁడు. లెండు, మీ మాన వత్వమును బ్రకటింపుఁడు! మీ కూపములనుండి వెలువడి

బాహాటముగా నలువైపులను దిలకింపుఁడు. ప్రపంచమందలి వివిధజాతులెట్లుముందంజ వేయుచున్నవో చూడుఁడు. (సోదర) మానవుని మీరు ప్రేమింతురా? స్వదేశమును మీరు ప్రేమింతురా? ప్రేమించుచో రండు, ఉన్నత పరిస్థితులకై, యోగ్యతరస్థితిగతులకై, నడుముగట్టుదము. వెనుకకుఁ జూడకుఁడు.

వ్యక్తిగానిందు, సంఘముగానిందు, ఇతరులతో, నితరసంఘములతో సంబంధము వీడి, యేకాకియై మనఁజాలదని నానిశ్చితాభిప్రాయము; తాము గొప్పవారమని కాని, యది యొకమహానీతియని కాని, దురభిప్రాయమున నెవ్వరైనను నటులొంటరిగా నుండఁ బ్రయత్నించినపుడెల్ల మహోపద్రవము సంభవించితీరినది.

దానము, ప్రతిగ్రహము—ఇదియే నియతి. భారత జాతి పునరుద్ధారణ నందవలయునన్నచో, విధిగాఁ దనరత్నరాసులను వెలికిఁ గొనివచ్చి బాహాటముగాఁ బ్రపంచ జాతుల కందఁజేయవలయును, తత్ప్రతిఫలముగా నితరులేమి యొసఁగెదరో దానిని బరిగ్రహింప సంసిద్ధము కావలయును.

భారతపుత్రులారా! నేఁడు మనము భారత దేశమునే కాక ప్రపంచమునంతయు మేల్కొల్పవలసియున్నది.

ఏ దోషములుండుఁగాక, నైతికముగను బారమార్థికముగను నితరజాతు లన్నిటికంటెను హిందువులు కోటిరెట్లు ఘనులని నా నిశ్చయము; స్వార్థరహితులగు భారతపుత్రు

లందఱును శ్రద్ధవహించి తగురీతిని ప్రయత్నించుచోఁ, బాశ్చాత్యతీవ్రకార్యదక్షతను భారతీయప్రశాంతి సందీపితసుగుణములతో మేళవించుటచే లోకమునఁ బరమోత్కృష్టులగు వ్యక్తులు వెలువడఁగలరని నా నమ్మకము.

నేఁటిపరిస్థితులను లక్షణములను గమనింపఁజాలనివారంధులు, జాత్యంధులు!... భారతదేశపునరుద్ధారణమునకే శ్రీరామకృష్ణపరమహంస యాగమనము. ఈదివ్యసంఘటనము సకాలమున మనకు సంప్రాప్తమైనది.

## పండ్రెండవ ప్రకరణము

# శ్రీ రామకృష్ణుఁడు

శ్రీ రామకృష్ణునిజీవితము దివ్యజ్యోతి. తదీయ తేజఃప్రసారమున సనాతనధర్మ పరమావధినంతయు, సనాతనధర్మపరమాదర్శముల నన్నిటిని యథారూపమున గ్రహింపనగును. వేదశాస్త్రోక్తజ్ఞానమున కంతకును నాతఁడే ప్రత్యక్ష ప్రమాణము. ఋషులును నవతారమూర్తులును నిజముగా వేనిని బోధింపనెంచిరో యా తత్త్వముల నన్నిటిని నీతఁడు తన జీవితమునఁ బ్రకటించెను. మతగ్రంథములు వాదమాత్రములు, ఈతఁడో, తదీయాచరణము, అనుభవము. ఈ పురుషుఁడు తన యేఁబదియేండ్లలోనే పంచసహస్రవర్ష పర్యంతమగు భారతజాతీయపారమార్థికజీవితమునంతయు జీవించి, భావిసంతతి కాదర్శనీయుఁడై యొప్పెను.

ద్వైతము, విశిష్టాద్వైతము, అద్వైతము ననునవి యాత్మ వికాసమునఁ గ్రమావస్థలనెడి యీతనిసిద్ధాంతమువలననే వేదము లర్థవంతములగును, శాస్త్రములకు సమన్వయ మేర్పడును. అన్యమతసహనము నవలంబింపవలయుననుటయేకాక, యన్యమతములును మోక్షమార్గములేయని మనఃపూర్వకముగా నంగీకరింపవలయుననియు సత్యమే సర్వమతములకును మూలాధారమనియు నాతని యుపదేశము.

భగవంతుఁడు సర్వాంతర్యామియైయున్నను మానవ రూపమునను మానవశీలమునను మాత్రమే మనకు గ్రాహ్యము కాఁగలఁడు. రామకృష్ణునంతటి పరిపూర్ణమైన వ్యక్తియు రామకృష్ణునిశీలమంతటి పరిపూర్ణమైన శీలమును మున్నెన్నఁడును వెలసియుండలేదు—ఆతని శీలవ్యక్తిత్వములే మన యాదర్శము కావలయును; మఱియుఁ బ్రతి వ్యక్తియుఁ దన దృక్పథము ననుసరించి యాతని భగవంతునిగనో, రక్షకునిగనో, ఆచార్యునిగనో, ఆదర్శమూర్తిగనో, మహాపురుషునిగనో పరిగణింప మన మంగీకరింపవలయును.

పూర్వాచార్యులందఱియుపదేశములకంటెను బరమహంసదేవుని యుపదేశములు విశేషముగా స్వతంత్రములు, ఉదారాశయసమన్వితములు, వికాసశోభితములు. పూర్వాచార్యులభావము లొకవిధముగాఁ బాక్షికములై యుండ, యోగ జ్ఞాన కర్మ భక్తి మార్గములందలి యుత్తమతత్త్వములు నూతనసమాజమును నిర్మించునటుల నేఁ డొండొంటితో సమ్మేళన మొందింపఁబడవలయునని యీ యాచార్య

శేఖరుఁడు—అవతారమూర్తి—మన కుపదేశించు చున్నాఁడు....పూర్వసంప్రదాయములు మంచివే, కాని యోగజ్ఞానకర్మభక్తి సంయోగము—స్త్రీపురుషాదిభేదములను బాటింపక, ఆచండాలము భక్తిజ్ఞానములనందఁజేయుధర్మవ్యాపనము—వర్తమానయుగనవీనధర్మము, నవీనమతము. పూర్వావతారపురుషులు తెలిపిన విషయములు మంచివే, కాని యవి యన్నియు రామకృష్ణునివ్యక్తిత్వమున సమ్మేళన మొందినవి...నవీనదైవముతో, నవీనవేదములతో నొప్పు నవీన భారతవర్షము నేఁడు మనకు లభ్యమైనది. ఎంతసేపు పురాతనవిషయములను బట్టుకొనియే—ప్రాఁతపుంతలను బట్టుకొనియే—ప్రాఁకులాడుచుండు నీ ఛాందసమునుండి, పరమేశ్వరా! మా దేశ మెపుడు విముక్తినొందునో కదా!

పదుమూడవ ప్రకరణము

## ఉ ద్బో ధ న

హే! భారతజననీ! నీ సతీత్వాదర్శము సీత—సావిత్రి—దమయంతి — యనుమాట మఱవకుము;— సర్వసంగ పరిత్యాగియు యతీశ్వరుఁడు నగు శంకరుఁడు—ఉమా మహేశ్వరుఁడు— నీ కారాధ్యుఁడనుమాట మఱవకుము;— నీ వివాహమునకు, నీ ధనమునకు, నీ జీవితమునకుఁ బరమార్థము తుచ్ఛవిషయసుఖము గాదనుమాట, వ్యక్తిగత భోగము గాదనుమాట మఱవకుము;—యజ్ఞనారాయణున

కాహుతియగునిమిత్తము జన్మించితివనుమాట మఱువకుము;—నీసమాజ మనంతజగన్మాతృత్వమునకుఁ బ్రతిబింబ మనుమాట మఱవకుము;—నిమ్నజాతులు, దీనులు, దరిద్రులు, అజ్ఞులు, నిరక్షరాస్యులును నీ తనూభవులనుమాట మఱవకుము. ఓ వీరభారతమాతా! ధైర్యము విడనాడకుము! ఓ వీరభారతపుత్రా! ధైర్యము వీడకుము! "నేను భారతీయుఁడ" నని గర్వింపుము! "నేను భారతీయుఁడను, ప్రతిభారతీయుఁడును నా సహోదరుఁడు" అని సగర్వముగాఁ బ్రకటింపుము! "అజ్ఞ భారతీయుఁడు, దీన భారతీయుఁడు, బ్రాహ్మణ భారతీయుఁడు, చండాలభారతీయుఁడు నా సహోదరుఁ"డని ప్రకటింపుము! జీర్ణవస్త్రధారివగు—కటిమాత్ర వస్త్రధారివగు—నీవును సగర్వముగా నెలుగెత్తి యిట్లు ఘోషింపుము: "భారతీయుఁడు నా సోదరుఁడు, భారతీయుఁడు నాప్రాణము; భారతీయ దేవతలే నాదైవతము; భారతసంఘము నాబాల్యడోలిక, యౌవననందనవనము, వార్ధకవారణాసి." సోదరా! ఇట్లు చాటుము: "భారతభూమి నా మహోన్నత స్వర్గము, భారతశ్రేయమే నాశ్రేయము." అహర్నిశ మిట్లు ప్రార్థింపుము: "ఓ మహేశ్వరా! ఓ లోకేశ్వరీ! నాకు మానవత్వమును బ్రసాదింపుఁడు, నాదౌర్బల్యమును దొలఁగింపుఁడు, నన్ను ధీరు నొనర్పుఁడు!"

ఉద్దేశములందును, ఆశయములందును, భారత దేశీయ సంస్థలను మించిన సంస్థలతోఁగూడిన దేశము ప్రపంచమున వేఱొకటి లేదని సదా జ్ఞప్తి నుంచుకొనుఁడు. ఇంచు

మించుఁగాఁ బ్రపంచమునఁ బ్రతిదేశమునందును జాతులను నేను గాంచియున్నాను, కాని వానివిధానమును, ఉద్దేశమును నిచటిజాతుల విధానోద్దేశములంతటి మనసీయమైనవి కావు. జాతివ్యవస్థ యిట్లనివార్యమైయున్నచో, డాలర్లపై (అనఁగా ధనముపై) నాధారపడియుండుదానికంటెఁ ద్యాగనైర్మల్య విజ్ఞానములపై నాధారపడియుండునదియే నాకు విశేషవాంఛనీయము. కావున నిందాలాపముల నాడకుఁడు. మౌనము వహించి మీహృదయద్వారమును దెఱచుకొనుఁడు. మీలోఁ బ్రతివ్యక్తియు భారమంతయుఁ దనపైనున్నదని భావించి భారతదేశముక్తిని యావత్ప్రపంచవిముక్తిని సాధింపుఁడు. వేదాంతజీవనవికాసముల నింటింటికిని గొనిపోయి, ప్రతి వ్యక్తియందును నిద్రాణమైయున్న దేవత్వమును మేల్కొల్పుఁడు. అపుడు మీరేపాటి విజయమును సాధించినను, ఒకమహోద్యమమునిమిత్తమై జీవించి, కృషియొనర్చి మరణించితిమను సంతృప్తి నొందఁగలరు. ఎట్లు సాధింపఁబడుఁగాక, యీ యుద్యమవిజయముననే మానవకోటియిహపరశ్రేయమంతయు నెలకొనియున్నది.

సాంఘికరాజకీయాశయములను భారతదేశమున వ్యాప్తిచేయుటకుముందుఁ బారమార్థికాశయములచే దేశము నాప్లావితమొనర్పుఁడు. మనప్రథమకర్తవ్యమిది: మనయుపనిషత్తులలో, మన వేదశాస్త్రములలో, మనపురాణములలో నిమిడియున్నయద్భుతతత్త్వములను గ్రంథములనుండి వెలికిఁ గైకొనివచ్చి, మఠములనుండి యీవలకుఁ దీసికొనివచ్చి,

యరణ్యములనుండి పైకిఁ గొనివచ్చి, ప్రత్యేకసమాజముల యధీనమునుండి బయటికి లాగుకొనివచ్చి, దేశమందంతటను—ఉత్తరమునుండి దక్షిణమువఱకును దూర్పునుండి పడమరవఱకును, సింధునదినుండి బ్రహ్మపుత్రానదివఱకును, ఆ సేతుహిమాచలము—వ్యాప్తిచేయవలయును.

భారతవర్షము నశించెనా, ప్రపంచమందలి పారమార్థికతయంతయు నశించును; నైతికపరిపూర్ణతయంతయు నశించును; దివ్యానందసంధాయకమగు మతసానుభూతియంతయు నశించును; ఆదర్శజీవనమంతయు నశించును; వానితావున ధనమను పురోహితునితో, స్పర్ధావంచనా బలాత్కారములను నుపచారములతో, మానవాత్మయను బలితో కామభోగములనెడి స్త్రీపురుషదేవత లేలుబడి సాగింతురు. కాని యట్టిదెన్నఁడును జరుగఁజాలదు. కార్యశక్తికంటెఁ గష్టానుభవశక్తి కోటిరెట్లు ఘనతరము; ద్వేషశక్తికంటెఁ బ్రేమశక్తి కోటిరెట్లు ఘనతరము.

వత్సలారా! ధీరోదారులారా! సహృదయులారా! ఉజ్జ్వలదీక్షాదక్షులు కండు, ఆశయసాఫల్యమునకుఁగాను గృషిచేయుఁడు, కార్యక్రమమును గొనసాగింపుఁడు! పేరు ప్రతిష్ఠలనుగాని, మఱియేమూర్ఖతనుగాని యాసింపకుఁడు. స్వార్థమును బాఱఁద్రోలి కార్యాంగణమున నుఱుకుఁడు! గడ్డిపోఁచలను బేని వెంటిగాఁ జేసినచో, వానితో మదించిన యేనుఁగును బంధింపవచ్చునని జ్ఞప్తి నుంచుకొనుఁడు. సర్వేశ్వరుఁడు మిమ్మందఱ ననుగ్రహించుఁగాక! సర్వేశ్వర

శక్తి మీయండఱయందును వెల్గొందుఁగాక!—వెల్గొందు చున్నదనియే నానమ్మకము. "ఉత్తిష్ఠత, జాగ్రత ,ప్రాప్య వరాన్ని బోధత!" (కఠోపనిషత్తు)—లెండు, మేల్కొనుఁడు, పరమపదప్రాప్తిపర్యంతము నాఁగవలదని వేదము ఉద్ఘోషించుచున్నవి. లెండు, లెండు! దీర్ఘనిశీథము పటాపంచలగు చున్నది, ప్రభాతము సమీపించుచున్నది. ఉత్సాహ తరంగము బయల్వెడలినది, తత్ ప్రభావము నెవ్వరునరికట్టఁ జాలరు. ధైర్యసాహసములు, వత్సలారా! ధైర్యసాహసములు! ప్రేమ, నాయనలారా! విశ్వమానవ ప్రేమ; విశ్వాసము—ఆత్మవిశ్వాసము; ఇఁక భయములేదు! భయమే మహాపాతకము!

ఘనకార్యములు జరుగవలసియున్నవి. భావిభాగ్యోదయముతోఁ బోల్చిచూచినచో, నీయల్పవిజయ మేపాటిది? నమ్ముఁడు, నామాట—భారతదేశ ముద్ధారణ నొందితీరును, జనసామాన్యమును బేదలును సుఖవంతు లొనర్పఁబడితీరెదరు—ఇది విధాయకము, ఈశ్వరాజ్ఞ. ఆనందింపుఁడు... ఆధ్యాత్మికవాహిని బయల్వెడలినది. అపారము, అప్రతిహతము, సర్వాప్లావమునై యీ దివ్యవాహిని మాతృభూమిపైఁ బ్రవహించుట నాకుఁ బ్రత్యక్షమై భాసించుచున్నది. ప్రతివ్యక్తియు ముందునకేఁగఁ, బ్రతిశక్తియుఁ దత్ప్రభావము నుద్దీప్తమొనర్పఁ, బ్రతిమానవుఁడును దన్మార్గమును రాజమార్గమొనర్పఁ దోడ్పడును! జయ! పరమేశ్వర!

వత్సలారా! ముందంజవేయుఁడు! లోకమునకంతె

కును వికాస మత్యావశ్యకమైయున్నది. దానికై లోకము వేచియున్నది. భారతదేశముననే యావికాసము—జ్ఞాన తేజము—కలదు; ఇంద్రజాలముననా? కాదు; మంత్రతంత్ర ములందా? కాదు; పరమార్థవైభవబోధనమున—మహోన్నతాధ్యాత్మికతత్త్వబోధనమున — నయ్యది వెల్గొందుచున్నది ఇందువలననే సమస్తవిఘాతములనుండియు భారత జాతిని విధాత కాపాడి, నేఁటివఱకును నిలిపియున్నాఁడు. ఇపుడు సమయము వచ్చినది. వత్సలారా! ధీరులారా! మీరందఱును ఘనకార్యము లొనర్చుటకు జన్మించితిమని నమ్ముఁడు! శ్వానగర్జనములకు—మూర్ఖప్రతిఘటనములకు—జడియకుఁడు, వజ్రాయుధఘాతమునకైనను వెఱవకుఁడు, సుస్థిరులై కృషి సాగింపుఁడు!

ప్రాచీన భారతవర్షము మహత్తరమైనదనుటకు సందియము లేదు, కాని భావిభారతవర్ష మింకను విశేషమహిమోపేతమై వెలయునని నా నిశ్చయము.

దీర్ఘనిశీథము పటాపంచలగుచున్నది, దుస్సహ యాతన తుదముట్టుచున్నది, మృతప్రాయమగు కళేబరము చైతన్యవంతమగుచందమునఁ బొడకట్టుచున్నది. చరిత్రగాని, యితిహాసముగాని కని విని యెఱుంగని ప్రాచీనకాలమునుండి యొకదివ్యవాణి—భారతవర్షమందుండియే—జ్ఞాన భక్తి కర్మముల కనంతహిమాలయమనఁదగు మనమాతృభూమి యందుండియే—మాఱుమ్రోఁగుచు, శాంతమయ్యును విస్పష్టస్వరకలితమై, దినములు గడచినకొలఁదియు గంభీ

రమైై, యొకదివ్యవాణి—వినవచ్చుచున్నది. అదిగో, నిద్రిత మేల్కాంచుచున్నది. మందమలయానిలము చందమున నాదివ్యవాణి చైతన్యరహితమగు స్నాయువులను నస్థులను బ్రాణవంతమొనర్చుచున్నది. అలసత గతించుచున్నది, మన భారతాంబ తనదీర్ఘనిద్రనుండి మేల్కాంచుచున్నది. అంధులు కనఁజాలకుందురుగాక, కుత్సితమతులు కననొల్ల కుందురుగాక; ఆమె నెవ్వరు నిఁకఁ బ్రతిఘటింపఁజాలరు; మన భారతమాత మఱల నిద్రపోఁబోవదు; ఏ బాహ్య శక్తియు నామె నిఁక నిరోధింపఁజాలదు. అఖండభారతశక్తి విజృంభించుచున్నది.

## భారతదేశపునరుద్ధారణకై స్వామి తెల్పిన విధానమందలి ముఖ్యవిషయములు

(1) వర్ణములలో నుపశాఖలను బోనడఁచి, యీ యుపశాఖలలో నంతర్వివాహములు జరుపుకొనవలయును. వివాహములకుఁ గొంత మితియనునది యుండవలయును. "ప్రతి వ్యక్తియుఁ బెండ్లికై యుబలాటపడి దేశమున మఱి పదుగురు బానిసలను గనుటవలనఁ బ్రయోజనము లేదు."

(2) తత్త్వబోధలకుముం దన్నపానములను సమకూర్చి జనసామాన్యస్థితిని బాగుచేయవలయును. ఇందులకై జను లలో విద్యావ్యాప్తిచేయు టత్యావశ్యకము. బ్రాహ్మణులను పండితులను నిందింపరాదు. ఏలన భారతీయవిజ్ఞానఖనులగు వేదశాస్త్రములను నిలువఁబెట్టినవారు బ్రాహ్మణులే. వారు లేనిచో భారతదేశమున సంస్కృత మీపాటి కంతరించెడిదే.

(3) దేశములోఁ దగురీతిని సంస్కృతవిద్యావ్యాప్తి జరుగవలయును.

(4) బలిష్ఠులను మేధానిధులను వెలువడఁజేయు జాతీయవిశ్వవిద్యాలయములు స్థాపింపఁబడవలయును.

(5) భారతదేశచరిత్రను భారతీయులే వ్రాయవలయును.

(6) త్యాగము, సేవ—ఇవియే మహోత్తమాదర్శములని భారతీయులు గుర్తింపవలయును.

(7) అంతఃకలహములను బోనడఁచి జనులలో నైకమత్యమును బెంపొందింపవలయును.

(8) స్త్రీలను నిమ్నజాతులను నుద్ధరింపనిదే మన భారతాంబ మేల్కొనదు.

(9) సనాతనధర్మతత్త్వములను పాశ్చాత్యులకు బోధించుటకును వారి పారిశ్రామికవిద్యలను నేర్చికొనుటకును యువకులకుఁ దగు శిక్షణ గఱపి పంపవలయును.

ఓం తత్ సత్

శ్రీ రామకృష్ణార్పణమస్తు.

# శ్రీ రామకృష్ణమఠ ప్రచురణములు

## శ్రీ వివేకానంద జీవిత చరిత్ర

(శ్రీ చిరంతనానందస్వామి విరచితము, నాల్గవకూర్పు)

"...ఈగ్రంథము ప్రతిగృహమునను భాండాగారమునను వెలయు నని నమ్ముచున్నాను. శ్రీ చిరంతనానందస్వామివంటి ప్రతిభాశాలియు చిట్టయునగు రచయిత మనకు లభించెఁగదాయను గర్వసంతోషములు నన్నిట్లు వ్రాయఁ బురికొల్పుచున్నవి...."

(సం.) కట్టమంచి రామలింగారెడ్డి.

సుమారు 350 పుటలు, చక్కని అట్ట బైన్డింగు. రూ. 2-0-0

## శ్రీ చిరంతనానందస్వామి అనువాదములు

## శ్రీ వివేకానంద ప్రణీతములు

## ప్రబోధ రత్నాకరము

గద్యానువాదకుఁడు శ్రీ చిరంతనానందస్వామి, పద్యానువాదకులు మహాకవి విశ్వనాథ సత్యనారాయణ, కవికోకిల జి. జాషువ.
సుమారు 200 పుటలు, సొగసైన కూర్పు. రూ. 1-12-0

## శ్రీ వివేకానంద లేఖావళి (మొదటి భాగము)

"...ఎల్లరును శ్రద్ధతో పదేపదే చదువవలసిన పుస్తకములలో నిది యొకటి...అనువాదకులగు శ్రీ చిరంతనానందస్వాములవారు గద్య రచనయం దాధునికులలో నద్వితీయులు...."

(సం.) కట్టమంచి రామలింగారెడ్డి.

276 పుటలు, ముచ్చటగు కూర్పు. రూ. 1-8-0

శ్రీ వివేకానంద సందేశామృతము (షికాగో ఉపన్యాసములు) అ. 6



LIBRARY